# మధురాదర్శము

[ హైస్కూలు పాఠశాలా విద్యార్థులకు ]



భారత్ పబ్లిషింగ్ కంపెనీ, తెనాలి.

 1945

# తొలిపలుకు

వ్యాసమహర్షి ద్రౌపదియు, వాల్మీకిమహాముని సీతయు భారతీయ నారీమణులకు సర్వకాలములయందును ఆదర్శప్రాయులు. మొదటివిదుషి అభిమాన సర్వస్వ క్షత్రియోచితమైన రజోగుణ ధురంధర. ద్వితీయ సాత్త్వికసంపత్తియందు అద్వితీయ. అదిఅట్లుండె.

ద్రౌపది జీవితము అపూర్వసంఘటనలతో అద్భుత ప్రతిఘటనలతో నిండియుండుటను పాఠకులవిధిగా ఉద్వేగులేకాదు; ఉద్రేకులుకూడ గావలసినదే.

అనవసరమైన శాంతిగాని, అపాత్రనిక్షిప్తమైన దయగాని, అసందర్భమైనక్షమగాని, అగపడినచో ధర్మరాజంతటివానినిఁ గూడ ఆమె ఎదుర్కొని వెనుదీయదు. కార్యాచరణ సందర్భమున భీమునంతటి మహాసత్త్వసంపన్నునికూడ- వానికిగాని మనకుగాని తెలియనిమే- తనచేతికీలుబొమ్మనుచేసికొన వలసినదే. సానుభూతి చూపవలసినచో సుభద్రనంతటి వీరాగ్రేసరునికూడ అనాదరమందహాస శిక్షాపాత్రునిని చేయవలసినదే. అట్లయ్యును ఆమె ప్రతిభావమునందును, ప్రతివాక్యమునందును, ప్రతికర్మమునందును పతిభక్తి సుస్ఫుటముగ ప్రకటితమగుచునే యుండును.

ద్రౌపదీదేవి సత్యభామకుఁ జేసిన హితోపదేశము సువర్ణాక్షరములతో లిఖింపజాలియున్నది. గృహనిర్వహణ విషయమున ద్రౌపదికి ద్రౌపదియేసాటి.

ద్రౌపదిజీవితము నందు మఱియొక గొప్పవిశేషముగలదు. ఎట్టిక్లిష్ట పరిస్థితులుకూడ ఆమెధీరతను చలింపఁజేయలేవు, సమయస్ఫూర్తిని కుంటు పఱుపలేవు. ఆమె బోధలు నీతిశాస్త్ర పారంగతులనుగూడ ముగ్ధులను చేసివైచును.

ద్రౌపది చరిత్ర నిర్మాణమునందు మన కవిత్రయమువారి సిద్ధహస్తములు పవిత్రమైన అద్భుతమైన కళను సృజించినవి. సహజపండితుని కవితావేశము కూడ నిందు చూడనగు. ఈగ్రంథమును తద్రచనయగా పాగినది. మహాభారత పఠనమునందు కుతూహలముగల విద్యార్థులకిది ఎంతయేని ఉపకరించు; ఇతరులకు కుతూహలము పుట్టింప జాలి యుండును.

ప్రభుత్వమువారి విద్యాప్రణాళిక ననుసరించి పద్యముల ధారా ప్రకటనము పరీక్షాపత్రము నందొక భాగమైనది. అందువలన ఇందు అందందు పద్యములుకూడ చేర్పబడినవి.

చరిత్రదృష్టితో జూచినను కళాదృష్టితో జూచినను మఱి యేయితర దృష్టితో జూచినను- మధురమైన ఉదాత్తప్రాయమైన ఈజీవితగాథ మనలఆనందవివశులనుచేయజాలియున్నదనుట నిర్వివాదమని మనవి

7-11-45
తెనాలి.

విధేయుడు
గ్రంథకర్త.

బును బ్రాహ్మణోపాస్తిచేయుచు, క్షైతసంభావిత కుటుంబ భారుండై ఘోరతపోవృత్తినున్న యాజుంగని నమస్కరించి తన్నుం గృతకృత్యునిజేసినచో "లక్షగోధేనువుల" నిత్తునని ప్రార్థించె.

ఆయ్యాజుండును యాజకర్మంబున కోషంబడి యజ్ఞ ద్రవ్యంబులు సమకట్టుకొని నిజసోదరుండగు నుపయాజుడు సహాయుండుగా సౌత్రామణియయిన కోకిలాదేవి పత్నిగా ద్రుపదునకుం బుత్రకామేష్టి చేయించె. అందు మంత్రాహుతులం దృప్తుండయిన యగ్నిదేవువలన జ్వాలాకీలాంగుండు వాల బృహచ్చాపధరుండు కిరీటాలంకారుండునగు నొకపుత్రుండును, అసితోత్పల కోమలామలాంగియు ఉత్పలసుగంధియు దివ్యతేజముబొల్పిన యొక్క కుమారియు, జ్వాలనకుండము నందుద్భవిల్లిరి. ఇట్లుపుట్టిన యాకొడుకునకుం గూతునకును ధృష్టద్యుమ్నుండును కృష్ణయు నను నామధేయంబు లాకాశవాణి జనవినుతంబులుగా నుచ్చరించె.

ఇట్లు ద్రుపదుండు లబ్ధసంతానుండై సంతసిల్లి యాజునకు యథోక్తదక్షిణలిచ్చి పూజించె.

ద్రౌపదీ ధృష్టద్యుమ్నులును శుక్లపక్ష చంద్రునింబోలి యభ్యుదయముగాంచి మించుచుండిరి. కాలక్రమంబున ధృష్టద్యుమ్నుండు ధనుర్వేద పారంగుండయ్యె. ద్రౌపది వివాహప్రాప్తయయ్యె.

ఇట్లుండ ద్రుపదుండొకనాడు మంత్రిపురోహిత విప్రసన్నిధిని, "కుంతియుం బాండవకుమారులును లక్కయింటిలో

న్యుగ్రాసలదగు ధైర్యని ధరామరముఖ్యుల వలన నెఱింగితి. ద్రౌపదిని దేవేంద్రనందనునకు దేవి జేయఁ బ్రీతితో గాంక్షించితి. ఇట్లు విఘ్నమాచరించుట విధాతృనకుఁ గాదియా! మహాధ్వరమునఁ బుట్టిన యీ సరసిజాక్షి నెవ్వలోరుఁ కునీనెగు?" అని దుఃఖపరవశుం డగుచుండె.

అప్పుడు దత్పురోహితుండు, "రాజా! పాండవుల గుఱించి బహువిధంబులగు నిమిత్తంబులు చూచితి. ఎందును వారలకు నెగ్గు లేదు; మీరుగుమిక్కిలి లగ్గగు. ఇదియునుగాక యనుకూలములగు నుపశకునములు పెక్కులు గానయ్యెడి. పాండవులు పరలోకగతులుగారు. పరమానందంబున నున్న వారు. ఇది తప్పదు. వారలెందుండి రేనియు నిటకువత్తురు. నీవును శాంతచిత్తుడవై స్వయంవరంబిప్పురంబున ఘోషింపంబంపుము. ఇది కన్యాదానంబునందు రాజులకు శాస్త్రచోదితంబు." అనిన ద్రుపదుం డూరడిల్లి పౌషమాసంబున బంచమియును రోహిణినాడు స్వయంవరంబని ఘోషింపించి బంగారు కాంతియు నెరికిని మోపెట్టను, దివ్యమ్ముశక్యంబుగాని దృఢకార్ముకమునను; దినమున దవ్వైదిరిగెడు కనక మత్స్యయంత్రమును జేసి భేదించిన వానికిఁ దన కూతు నిత్తునని తెలిపి పరమానందంబునఁ బొదలుచుండె. అది యిట్లుండె.

# రెండవ ప్రకరణము

లాక్షాగృహ దహనానంతరము కుంతియుఁ బాండవు లతిప్రయాస ప్రయాణంబున మత్స్యత్రిగర్త కీచకాది విషయంబులు గడచి యేకచక్ర పురంబను నగ్రహారంబు ప్రవేశించిరి. అందు వారు జటాజిన తరువల్కలం ధరులై వేదాధ్యయనము చేయుచు బ్రహ్మచారి వృత్తితో నొక విప్రగృహంబున విడిసి యుండిరి.

అప్పురంబున వారు భిక్షావృత్తి జీవించు చుండిరి. ప్రతి నిత్యము భైక్ష భిక్షాపూర్ణమైన యయిదు పాత్రములను దమ తల్లికి నివేదింతురు. ఆమెయుఁ దత్పదార్థములను రెండు భాగములుచేసి, యందొక్క భాగంబు భీమునకుం బెట్టి తక్కిన భాగంబు తానును గొడుకులుం గుడుచుచు, కొంత కాలంబు గడపుచుండె.

ఇట్లు కొన్ని దినంబులు వారు సుఖంబున్నంత నొకనాఁడు బ్రాహ్మణుఁడొకండు ద్రుపదపురంబున నుండి చనుదెంచి, విశ్రమార్థియై, పాండవులున్న గృహంబున విడిసియుండె. కుంతీదేవి కొడుకులుం దానును నవ్విప్రు నతిభక్తి నుపాసించి, "అయ్యా! యెందుండి వచ్చితిరి? ఏ దేశంబులు రమ్యంబులు? ఎందుల రాజులు గుణవంతులు?", అని యడిగిన నవ్విప్రుం డిట్లనియె.

"ఎల్ల దేశంబులును, తద్రాజులచరిత్ర సంపదలను జూచితి. ద్రుపదుని దేశముతోఁ బోల్పనర్హములగునవి యొండు దేశంబులు లేవు. సర్వసద్గుణంబులఁ బరరాజు లెవ్వరు ద్రుపదుఁ

పోలరేరు, ఆ ద్రుపదుండను తనకూతు, నయోనిజను, నగణ్యపుణ్య లావణ్య సమన్వితను, అభిమతుండైన రాజపుత్రునకు వివాహంబు నేయుంజాలక స్వయంవరంబు రచించుచున్నవాఁడు." అని చెప్పియరిగె.

దానివిని పాండునందనులందులకుం బోవనెంచిరి. కొడుకుల యభిప్రాయం బెఱింగి కుంతీదేవి యిట్లనియె.

"ఇందుఁగడు బెద్దకాలముంటిమి. ఇంకెంతకాలమున్నను మనకగులాభమేమి! ఎన్నఁడు నొరు యింటి పొత్తునమంట యుచితమే! దక్షిణ పాంచాలదేశంబులు సిరంబు రమ్యంబులని వింటిమి గదా! పాంచాలపతియుఁ బరమ ధార్మికుండఁట; అందులకుం బోదము."

పాండవులును సంతుష్టాంతరంగులై "మీరెంచినయట్లు నేయుంగలవార" మని తల్లితోఁ బలికిరి. తాము యున్నయింటి బ్రాహ్మణునకుఁజెప్పి వీడ్కొని, మహోగ్రవనంబులు, సరసీవనంబులు, నేఱులుఁ బ్రస్తరపాషాణంబులుగడచి, నిరంతరగతి నేగుచుండిరి. మార్గమధ్యమున వేదవ్యాస మహామునీంద్రుంగాంచి, నమస్కారంబుగావించిరి.

అమ్మునీంద్రుండును, వారలంజూచి "మీరు ద్రుపదపురంబునకుం జక్కనరుగుఁడు. మీకు లగ్గగు" అని హెచ్చరించి యంతర్ధానుండయ్యె.

పాండవులు జననీసహితం బనవరతంబు రాత్రులుం బవళ్ళును బనయంబు వోవు వారొక్కనాఁ డర్ధరాత్రంబున గంగాస్నానాభిలాషంజేసి ప్రకాశార్థంబును రక్షణార్థంబుగా నొక్క

కొఱవి చేతఁబట్టుకొని, యర్జునుండు ముందు నడుచుచుండ నందఱు పిఱుంద నరుగుచుండిరి.

అంతకు మున్నె యంగారపర్ణుఁడను గంధర్వకుమారుండు ప్రియాంగనాసహితంబు గంగకు జలక్రీడార్థంబు వచ్చె. అతఁడు పాండవుల పాదధ్వని విని, యలిగి, విల్లుగొని, గుణధ్వని చేసి "నన్ను డాయకుండుఁడు, నేను కుబేరసఖుండ నంగారపర్ణుఁడ. నేనిందు విహరించుచుంటి. ఇప్పుడంబు గంగయు నంగారపర్ణ యను పేరిట జగత్ప్రసిద్ధంబుగా నున్నది. దీని మానవులు చేరరాదు, పొండు" అనిన నర్జునుండు "పుణ్యభాగీరథి యందఱకు సేవ్యంబె. నీ సొమ్మా యుదకంబో" యనియె.

అంత నాతఁడు బిరుసులు పల్కికొనుచు గోలంబులు పెట్టింపఁ బోరుచో నంగారపర్ణుఁడు నర్జునుఁడు గెల్వ, ధర్మరాజుచే నాశ్వాసింపఁబడి, చాక్షుషియను విద్య నర్జునునకును, గంధర్వ హయంబులు పాండుపుత్రులకు నొసఁగి, వారితోడి సఖ్యం బంగీకరించి చనియె.

ఆపాండవులు భాగీరథి నుత్తరించి, యుత్కచంబను పుణ్యతీర్థంబున కరిగి, యందు నిరస్తసమస్తదోషుండై ఘోరతపం బొనరించు దేవలభ్రాత యగు ధౌమ్యుని బురోహితుఁగా వరియించిరి. ధౌమ్యుఁడును వారి సత్ప్రీతిం బూజించి పురోహితత్వంబు పరిగ్రహించె. పాండవులును నశేష మహామహీరాజ్యంబు వడసినంత సంతసిల్లిరి. పిదపఁ దత్కృతస్వస్త్యయనులయి జననీసహితంబుగ దక్షిణపాంచాలాభిముఖులైరి.

అట్లరుగువారు ముందర ద్రుపదపురంబునకుం బోయెడు బ్రాహ్మణులం గని "మీరా పురంబునకుం బోయెదరే"ని యడిగిన వారిట్లనిరి.

"ద్రుపదరాజతనయ స్వయంవరంబు రామణీయకంబుగా రచియింపం బడుచుండెను. ఎందఱు ద్రౌపదిం జూడంగనిన వారు, దృష్టించగనిన ఫల బడసియుండిరి. అట్టి మహోత్సవంబు చూడ ద్రుపదపురంబునకుం బోయెదము. అపార భూదక్షిణ యజ్ఞకరులును, ఆశ్రిత ప్రపాదకులును, నయిన నానాదేశాధిపతులు నిచటకుం జనుదెంతురు. ఆనాటి ... బ్రాహ్మణులకు ... మీరును నచటికి జూడవచ్చెదరేని నొక్కలం బోదము, రండు." అని మాటలాడుచు వచ్చు బ్రాహ్మణులతోడం బాండవులు బ్రాహ్మణరూపధరులై ద్రుపద పురంబునకు జనుచుండిరి.

ఇట్లు పోవువారొక్కట నెదుర కృష్ణద్వైపాయనుం గని వినయంబున నందఱు కృతాంజలులైరి.

అంత వారికి హృదయానందంబుగా సత్యవతీ సూనుండు ఆగామిక శుభంబులావేదించి చనియె. పాండవులును కతిపయ దినంబులకు సురక్షితంబుగా ద్రుపద పురంబు సొచ్చిరి. అందు నాలుగు దిక్కుల విడిసియున్న నానాదేశాగతమహీనాథుల బహువిధ స్కంధావారంబులం జూచుచుం జనిచని యొక్క కుంభకార గృహంబున విడిసి తమ్మెవ్వరు నెఱుంగకుండ బ్రాహ్మణవృత్తి నుండిరి.

# మూడవ ప్రకరణము

నాఁడు సోమవారంబునఁ బంచమి. మహా మహీపతు లందఱు నొండొరులఁ గడచుచు మిక్కిలి వేడుకతోఁ దొడి, పూసి, కట్టి, అత్యంత విభూతిమై తమతమ చిహ్నములు లెఱుక పడఁగా భూతలము గ్రక్కదలఁగా ద్రౌపదీస్వయంవర రంగ భూమికిఁ జనుచుండిరి.

స్వయంవరరంగము పురంబు పూర్వోత్తర దిశాభాగంబున రచింపంబడియె. అచటి నేలయంతయుఁ జందనోదకసంసిక్తము. అగాధోన్నతపరిఘాప్రాకార సమన్వితము. విశాలద్వార తోరణసంయుతము. అనేక ప్రాకార హాను సమన్వితము.

అందు నానాదేశాగతరాజన్యులందఱు యథాస్థానంబుల నుండిరి. పరమబ్రహ్మణ్యులైన బ్రాహ్మణులతోడం గలిసి పాండవులును విచ్చేసి యుచితాసనంబుల నాసీనులై యుండిరి.

ఆ శుభసమయంబున సితవిభూషణ దామానులేపనాంగియై సితమాల్యధారిణియై ద్రౌపదిరంగమధ్యమునకుఁ జనుదెంచె.

త్తోష్ట్రో ఆశీర్వాద నినాదముతో ద్రుపద పురోహితుండును కృతపరిస్తరణుఁడై వివాహోపస్కరచయము గాచి యుండె. జనుల యులివును, వాదిత్రనాదంబును ఘోరన మ్రోయుచుండె.

ఆ సమయంబున ఆ సంకులధ్వని నంతను వారించి, మూఁగిన రాజలోకంబు నెల్లను జూచి, యగ్నిసమీపంబున

గంధపుష్పధూపదీపార్చితం బైన విల్లును, నమ్ములును, వైహాయ సంబైన లక్ష్యంబును వారలకుం జూపి ధృష్టద్యుమ్నుం డిట్లనియె.

"ఈవింటిని మోపెట్టి యయిదు బాణముల నీ మత్స్య యంత్రంబు నేసినవాఁడీబాలకుఁ దగిన పతి. ఘనకార్ముక కౌశలోన్నతియు, లావును గలవారలకు లలితయశంబును, కల్యాణంబును బడయ నిదియ యవసరంబు."

ఇట్లు ధృష్టద్యుమ్నుఁడు రాజపుత్రులకు నెల్ల నెఱుంగ జెప్పి, ద్రుపదరాజపుత్రిఁ జూచి, అఖిలమహీతలంబునం గలరాజ నందనులెల్ల నీ స్వయంవరంబునకు వచ్చినవారు. వీరిఁ జూడుమని, దుర్యోధన దుశ్శాసన ప్రముఖులైన ధృతరాష్ట్రనందనుల నూర్వురను, దత్సమీపంబుననున్న కర్ణాశ్వత్థామ సోమదత్త భూరిశ్రవ శ్రుతసేనాదులను, పుత్రభాతృసమేతులైయున్న శల్య విరాట జరాసంధ గాంధార పతులను, అక్రూర సాత్యకి సాంబ సంకర్షణ ప్రద్యుమ్న కృష్ణ కృతవర్మానిరుద్ధ యుయుధాన బలదేవులు మొదలైన యదు వృష్ణి భోజాంధకవరులును, మిగి లిన నానాదేశాధీశులను, వేదధ్వని నొప్పుచున్న బ్రాహ్మణ సమూహంబును జూపి "ఇందు లక్ష్యమెవండు వేయంగలండో వాని వరింపు" మని చెప్పె,

స్వయంవర దర్శన కుతూహలంబునం జేసి వచ్చిన దివిజ ఖచర గరుడ గంధర్వ కిన్నరుల విమానంబు లంబరతలంబున వెలసె. రసవత్తరగీతరవ మెల్లదెసల నెసఁగె. మహాజలధి ధ్వానంబు ననుకరించుచు బోరన వివిధ తూర్యారావంబులు

మ్రోగుచుండె. దివ్యానులేపనములయు, దివ్యమాల్యములయు సౌరభంబు దాల్చి, రంగమధ్య జనములకుం గడుం బ్రియముగా మందమారుతంబు వీచుచుండె.

భస్మమధ్యమున విస్ఫులింగంబులువోలె రాజవరులలోఁ బాండునందనులఁ జేవురంజూచి, కృష్ణుండు వారి నెఱిఁగె; నవ్వారి పాణ్డుం డీమెను గ్రహించునని పరమానందంబు పొందుచుండె.

అంత నారాజనందనులు తమ్ముఁ దమసామర్థ్యంబు నెఱుంగజాలక, యర్థిత్వంబున నవ్విల్లు మోపెట్టఁ బోయి, వడివడి నొవ్వఁగఁజూచి ఎలకేలు గొనయముఁ బెనచి, నిల్చి, విల్లు వంపనేరక యుడిగిరి.

అందు గొందఱు "ఇది మాయాధనువు; మోపెట్టఁగఁ గొలఁదియే!" యని డాయకయే యుండిరి. నిక్కముగా మఱి కొందఱు, "ఇది యెట్లును సమకూరదు. బ్రహ్మాదులకైన నీవిల్లుమోపెట్టి, అంతరిక్షలక్ష్యంబు భేదింప నలవిగాదు." అని విచారించుచు నిజయోగ్యమార్గములు చూచుచునేగిరి.

యదువృష్టిభోజాంధకవీరులు కృష్ణానుమతంబున నిజ్య కర్మంబునం దనాదరబుద్ధులయి యున్నకుండిరి.

శిశుపాల జరాసంధ శల్య కర్ణులు తమలావు మెఱసి క్రమంబున నలువురు మోవ యవ ముగ్గ తిలమాత్రంబులు దక్కఁ గొనయంబెక్కించియు, మోపెట్ట నశక్యంబైన, నుక్కు సెడి స్రుక్కిరి.

ఆసమయంబున వారలఁజూచి, యగ్రజానుమతంబున విప్రసభ వెలువడి, విజయుండు తనలావు మెఱసి ధనుస్సమీ

నంబునకరిగె. అతని యుత్సాహంబున కచ్చెరువడి కొందఱు బ్రాహ్మణులు దమలో నిట్లనుకొనిరి. "ఈ మూఁగిన మనుజేంద్ర నందనులు అసహాయ బలులు; బాహువీర్యమ్ములవారు. అట్టివారు శరాసనకర్షమునం దొప్పరఁట! విప్రవంశమ్మున వారినందఱ నవ్వులపాలుచేయ దర్పమ్మున నీతఁడొకఁడు బయలుదేరు చున్నాఁడు."

మఱికొందఱు ధాత్రీసురులిట్లనుకొనుచుండిరి, "ఇతఁడు సద్వమలాచారుఁడు. విష్ణుభక్తిపరుఁడు. అత్యంత తేజస్వి. దీర్ఘ బాహుపరిఘుండు. అమితోత్సాహుఁడు. ఈరాజనందనులకంటెఁ గార్తికేయద్యుతి గలిగినవాఁడు. కావుటంజేసియే దీని మొనసె. అన్యుఁడిట్లు మొనయంగలఁడె. విప్రప్రసాదంబున నెల్లవిప్రులకు సంతసంబుగాఁ గార్యసంసిద్ధి నుత్తముఁడై పొందెడుఁగాక".

ఇట్లు బ్రాహ్మణులందఱు పరస్పర వితర్కపరాయణులై యుండిరి; రాజలోకంబు చకితమై యుండె. జనసమూహంబు బిత్తరాశ్చర్యపడుచుండె; అయ్యర్జునుండు వింటిసమీపంబునకుఁ జనుదెంచె. గురువులందఱలంచి, నమస్కారంబుచేసె. ధనువునకుఁ బ్రదక్షిణంబుచేసి, మ్రొక్కి. పుచ్చుకొని, పూర్వ పరిచితంబైన విల్లు మోపెట్టినట్లశ్రమంబున మోపెట్టె. ఏనమ్మిల నమ్మత్స్యయంత్రంబు నాక్షణంబ యురలం దెగనేసె.

బ్రాహ్మణ క్షత్రియ ప్రముఖులైన జనులెల్ల విస్మితు లైరి. "పర్ణఫలపవనాంబుభోజనవ్రతములంజేసి దుర్బల తను లయ్యును బ్రాహ్మణులు తపోవిశేషముచే మహాబలయుతులు. అట్టివారలకు నెందునసాధ్యమెద్ది? నిమిషాంతరమున నశ్రమ

మున మర్త్యులకు విశ్లేయ సమకూడునె? ఇతఁడు బ్రాహ్మణ రూపమునఁనున్న మహేశ్వరుఁడో! హరుఁడో! భానుఁడో!" అని పొగడెడు జనుల నిరంతర రవంబును, నంబరతలంబునుండి పొగడు దివ్యుల యనవరతరవంబు నొక్కఁడై కనునొప్పెను.

సురదుందుభి ధ్వనములు చెలఁగెను. పుష్పవృష్టి కురియ సాగె. బ్రాహ్మణులెల్లం బయిపుట్టంబులు వీచి వీచి యార్చిరి.

అయ్యవసరంబున ధర్మనందనుండును నకుల సహదేవానుగమ్యమానుండై నిజనివాసంబునకుం జనియె. ధృష్టద్యుమ్నుడు మహాసేనతో నర్జునునకు సహాయుండై నిలిచె.

అపుడు ద్రుపదరాజాత్మజ, చనుదెంచి, ధనంజయుని దనచేతిసితపుష్ప దామకంబునఁ బూజించె.

# నాల్గవ ప్రకరణము

అమ్మహోత్సవంబు చూడఁజూడ రాజులకుఁ గన్నెఱ్ఱ యాయె. కౌరవేంద్రుఁ డాదిగాఁ గల భూపతులందఱు గను నలిగి "చుట్టమువోలె మహీశుల నందఱ నెందులకు రాఁబిలిచె? ఇందఱు మహారథులుండ, గన్యను విప్రున కేలనిచ్చె? పాంచాల భూపతి శఠుండు, ఈతని నాజిలో ఓడింతము. ఏమిదోషంబుచేసియు బ్రాహ్మణుండు వధ్యుండు గాఁడు. కావునఁ విప్రుతోడి దేమి! అదియుంగాక తనవిద్యాపేర్మిచే నీ విప్రుఁడు నృపనందనఁ బడిసె. ఇదితప్పుగాదు." అనుచు ద్రుపదుపై నేఁగుదెంచిరి.

ద్రుపదుండును భీతుండై బ్రాహ్మణుల మఱువుసొచ్చె. ఇట్లు శరణాగతుండైన ద్రుపదు "నోడకుండు" మని బ్రాహ్మణులు తమ తమ దండాజినంబులెత్తి ప్రతిబలంబులపై వీచుచున్న వారలం జూచి నగుచు నర్జునుం డిట్లనియె.

"మదీయామోఘాస్త్రంబుల నిప్పుడీ రిపునృపుల దర్పం బుడిగించెద. మీరలు చూచుచుండుఁడు".

అని తానును భీమసేనుండును గ్రమ్మఱి రిపుబలంబుపై సమితిశరంబులేసె. భీముండు నొక్క వృక్షంబు పెఱికికొని దండహస్తుండయిన దండధరుండునుం బోలె నర్జునునకు సహాయుండై నిలిచె. అయ్యిరువుర మహాసంరంభంబు చూచి విస్మితుండై కృష్ణుండు బలదేవున కిట్లనియె.

"కాలాభ్రమైన వింటిం దాల్చి విరోధుల నెగచుచున్న వాఁడు దేవేంద్రనందనుండు. అతని కెలన మహావృక్షహస్తుఁడై యున్న వీరుండు భీముండు. నరోత్తమ యంత్రంబు నేసిన యప్పుడు పోయిన యా కౌరవ వర్ణుండు ధర్మతనూజుండు. అతని తోడ నరిగిన యిరువురు కవలవారు. ఇదియెట్టి పుణ్యదినమో! లక్క యింట నగ్ని దాహంబున వీరెట్లు బ్రతికిరో గదా!" యనువిని హాలా యుధుండు సంతసిల్లుచుండె.

ఆ సమయంబునఁ గర్ణుండు నరుఁడాకెకు, శల్యుండు భీముం డాఁకెకు. కర్ణ విజయులు నొండొరులఁ జూచి దాఁకి, బాణంబు లాకర్ణాంతంబులగుచుండఁగా దీసిరి. మహోగ్రక్రోధ మూర్తులయి బాణతతి ప్రయోగించిరి. ధరిత్రి యెల్ల వివసె. దిక్కులు నూఁగాడెకె. అర్జును బాణంబుల సహింపనేరక, బ్రాహ్మణతేజంబు దుర్జే యంబని, విజయుతోడ యుద్ధంబు సేయనొల్లక కర్ణుండు మరలె. శల్య భీమసేనులు పెనంగి మల్లయుద్ధంబు సేయునెడ భీముండు తన బలంబునం బట్టికొని శల్యుం బ్రదెళ్లవైచె.

అవ్వారి మహాపరాక్రమంబుం జూచి దుర్యోధనాదులయిన రాజపుత్రులెల్ల విస్మితులై "వీరెవ్వరో? ఎ చుండి వచ్చిరో? ఎటువంటి వారలయు" నని యనుకొనుచుండిరి.

వారలం జూచి కృష్ణుండిట్లనియె. "పరమదుష్కర భాసుర కార్యము చేసి, ఈ స్వయంవరమున, నీ ధరణీసురాన్వయోత్త ముఁడు ధర్మపద్ధతిగాఁ గృష్ణను ధర్మపత్నిగాఁ బడసె. అనవద్య పరాక్రముఁడైన వీని నాక్రమింప నెవ్వరికిని జన్నె! వలవ దుడుగుఁడు.

ఇట్లు కృష్ణుచే సత్కృతులైన రాజపుత్రులు తమ తమ దేశములకుం జనిరి. భీమార్జునులు బ్రాహ్మణ పరివృతులయి ద్రుపదరాజపుత్రిం దోడ్కొని చనిరి.

ఇంటం గుంతీదేవియు "పుత్రులు ఉత్సవదర్శనోత్సుకులై పోయిరి. ఇదుం బెద్దప్రొద్దయినది. ఏల మరలిరో? వినుగక వైరంబు భావించి పాపస్వభావులు కౌరవులు క్రందుననెత్తిగి వారిం జంపిరో? ఇంకులకు నెవ్వరు నొక్కటనేల యనిగిరి! వేదవ్యాసువచనంబు నూన్ఋతంబు గాకుండునా? వేల్పులార! భూసురేశ్వరులార! మీ శరణంబకాని మఱియొండుగతి నాకు లేదు. నాకు శరణముగుదు కొడుకులం బ్రీతితో రక్షింపుడు" అని పలుకుచుండె.

అట్టి యవసరంబునం దల్లియొద్దకు ధర్మరాజును గవల మారును మున్న వచ్చిరి. అనంతరము భీమార్జునులు ద్రౌపదీ సహితులై వచ్చి మమొక్క భిక్షం దెచ్చితిమని తల్లికి నివేదించిరి. ఆమెయు నెఱుంగక యెప్పటియట్ల కాతలంచి 'దాని మీ రేవురు నుపయోగింపుడ' ని కొడుకుల నియమించి, భువనత్రియ రాజ్యలక్ష్మియుంబోలె నున్న యక్కన్యకం జూచి లజ్జించి యధర్మభీతయై ధర్మతనయున కిట్లనియె.

"ఈలలితాంగిని దోడ్కొని నీతమ్ములిరువురు నేతెంచి, "ఈభిక్షం గొను" మని నాకునివేదింప నేవురు నుపయోగింపుం డంటి. నాయుక్తి యొప్పుడనృతంబుగాదు. మీరును మద్వచనాతిక్రమంబు సేయరు. ఇదిలోకమున లేనివింత. ఏమిసేయంగవచ్చు."

" అనుచుం జింతాకులాత్మ అయ్యె. తల్లినూరార్చుచు నర్జునుం

జూచి ధర్మరాజిట్లనియె. "పార్థా! ఇదినీచేతఁ బడయంబడినది అగ్నిసన్నిధి పాణిగ్రహణంబునీవ చేయుము.

అనిన భార్గుండిట్లనియె. "పెద్దవాఁడుండఁ జిన్నవాఁడు వివాహంబగుట ధర్మవిరుద్ధంబు. కావునదీనినీ వగ్రమహిషిగాఁ బరిగ్రహింపుము. మా నలువుర యభిమతంబిట్టిద."

అనుచున్న యవసరంబున విధిప్రేరణంబునంజేసి పాండునృపాలతనూజ పంచకంబును ఆ లలితాంగియందు హృదయంబులు దృష్టులు నిల్పిరి. ఏవ్వరకుఁ బత్నిగా సృజించియున్న బ్రహ్మచెయ్వు పరమార్థముగాక రిత్తపోవునా!

అందఱ యభిప్రాయంబును గ్రహించి వేదవ్యాస వచనంబులు దలంచి ధర్మతనయుండు తమ్ములకిట్లనియె.

"మన కేవ్వరకు నిడిపత్ని గాఁదగును. కావున మనమందఱము నీతరుణిఁ బరిగ్రహింతము. ఇది గురువచనము. మఱియొకలాగగుట దుర్ఘటము. కావున మనకు బాపభయంబు వలవదు.

అని పలుకునపుడు రామకృష్ణులు ధర్మజునొద్దకు వచ్చి కని, తమ్ములెఱింగించి యుధిష్ఠిరునకుఁ గుంతీ దేవికిఁ బ్రమొక్కి, భీమార్జుననకుల సహదేవులం గౌఁగిలించుకొని, పరమసమ్మదరసపూరితులై యుండిరి. వారికుశలమడిగి ధర్మజుఁ డిట్లనియె "కౌరవులకు దవ్వై విప్రవేషధారులమై యుంటిమి. మమ్మిప్వరు నెఱుంగఁ జాలకుండిరి. మీరెట్లెఱింగితిరి"

అనిన నగుచు వాసుదేవుఁడు "అంబుజ మిత్రుండు అంబుదసమూహాంతరితుండైనను జగజ్జనంబులకుఁ దదీయ తేజంబు కప్పనగునా! మీమహాతేజము భూజనప్రసిద్ధంబు. దాని

మాటుపఱుప నెవ్వరునేర్తురు. సకలరాజ సమక్షంబున నట్టియతి మానుషంబైన యద్భుతకర్మంబు పార్థునకుంగాక అన్యులకుఁ జేయనగునే! మీపరాక్రమంబే మిమ్మెఱింగించె. ధర్మవిహితు లగు ధృతరాష్ట్ర దుర్యోధనులు సేసిన లాక్షాగృహదాహంబు వలన విముక్తులరైతిరి. ఇంక మీకులగ్గగుఁ".

అనిచెప్పి బలదేవసహితుండై వాసుదేవుండరిగె.

# ఐదవ ప్రకరణము

ఇట ద్రుపదుండు తన కూతునకు వరుండైన వాఁడెవండో, ఏ వంశంబువాఁడో, వాని చరిత్రం బెట్టిదో, ఎఱింగి రమ్మని ధృష్టద్యుమ్నుని బనిచె. అతండును భీమార్జునుల పిఱుందన వచ్చి, తన్నెవ్వరెఱుంగకుండ నక్కుంభకార గృహంబున నుండి యంతయు నెఱింగిపోయి ద్రుపదునకిట్లనియె.

"అయ్యిరువురు నట్లు కృష్ణం గొనిపోయి యొక్క ముదుసలి సాపికి మ్రొక్కి యక్కన్యను మ్రొక్కించిరి. నుతి యొకగౌరవర్ణుండు పంపఁగా నలుగురు భూసురగృహంబుల కరిగి భైక్షము దెచ్చిరి. అంత కూఁతును నయ్యవ్వ కొప్పించిరి. ఆపెయు ద్రౌపదిం బిలిచి "బలివిధానంబుకును ద్విజాతిథులకును, అన్నార్తులకును నగ్రమంగా నిడి శేషంబు రెండు పాళ్లు సేయుము. అందొకపాలు వెడదయురంబు గల్గిన కడుపును గల యాతనికిఁ బెట్టుము. రెండవపాలన్నలు నలువురకుం బెట్టుము. తద్భుక్తశేషంబు నీవును నేను నుపయోగింతము" అని పంచె.

కృష్ణయు నయ్యవ్వ పంచిన రూపున నందఱకుం గుడువం బెట్టి తానును భుజించి దర్భలు విఱిచి అందఱకు వేఱువేఱు శయనమ్ముల సమ్మగా రచియించె. వానిపై వారల కృష్ణాజినంబులు పఱిచె. అందఱు సుఖశయనులై యున్న వారిపాదంబులకు నుపధానభూతయై శయనించె.

కఱకుదర్భలు పఱుపులుగా, భిక్షాన్నమశనముగా నున్నను కృష్ణ వారి సతిముదమున నాదరించె. అదిగర్భేశ్వరి యయ్యు

సేవగింపదయ్యె. 'శదవసములుఁ గోలలుఁ గప్పదములు వారి ధనము. వారెక్కడి దేశికులు!' అనివగవక వారినత్యాదరముతో గొల్చుచున్నయది.

అన్యోన్యులు నా యాకథలఁ జెప్పుచు రథసింధురాశ్వవిషయంబులను, సుశిక్షణాస్త్ర్యాశ్వ సిద్ధ్యుపాయవిధులును, ఆయుధ విద్యా విహాస్త్ర ప్రయుక్తులును బలికొనుచుండిరి. ఒలిపిన మాడ నత్యుత్తమక్షత్రియులు గానోపుదురు. చదువులనుబట్టి చూడ స్వజాతివారలగుదురు. వారింక జాతుల వారు గారు మహాత్ములగుదురు."

అని చెప్ప ద్రుపదుఁడానందించి నోడియువారలనిమ్ముగా నెఱుంగవేసి, తనపురోహితునిఁబంపెను. అతండును బ్రాహ్మణ సమూహంబులతోఁ జని, పాండవులం గని, ధర్మరాజునియోగంబున నుచితాసనాసీనుండై పూజితుండై యిట్లనియె.

"మీ కులంబు మీ నామగోత్రనామములను బ్రియంబున నెఱుంగంగోరి ద్రుపదుండు నన్ను బంచె. అతనికిఁ బ్రియంబుగా మీ వృత్తాంతమును నాకెఱింగింప వేడెద. సుకీర్తియు మత్స్య యంత్రమేసిన సుభ్రము నాతఁడు చూడఁ గోరుచున్నాడు."

అనిన విని నగుచు ధర్మజుఁ డిట్లనియె. "ఆవిలు మోపెట్టియమ్మత్స్యయంత్రలక్ష్యంబు భేదించినవానికి, దనకూతు నిత్తునని మీరాజు నియమము సేసెఁ గదా! అతఁడు నియమించిన చొప్పుననే యయ్యంత్రమేసి యీతఁడిక్కన్య బడసెను. ఇంక మీ విభుఁడు మమ్మెఱుంగనేల! ఎఱింగి యేమిచేయువాఁడు!.

అకార్యక్రమము మోపెట్టి, తివియగా బలహీనునకునలవి యగునా! మీరాజు మనోరథంబు సఫలంబయ్యె. వగవ నేల!"

ధర్మరాజు పలుకులువిని పురోహితుండు వారలవీడ్కొని ద్రుపదరాజుపాలికింజని తద్వృత్తాంతంబంతయు నెఱింగించె. ద్రుపదుండు ధృష్టద్యుమ్నుంజూచి చాతుర్వర్ణోచితంబులగు రథంబులు గొనిపోయి వారలందోడ్కొని రమ్మనిపంచె.

అతండును నాక్షణంబ పాండవులపాలికివచ్చి, ఈరథంబు లెక్కి మారాజునొద్దకు రండనియె. పాండవులు రాజయోగ్యం బులును రత్నాంచితంబులును నగురథంబు లెక్కి, కుంతీదేవిని ద్రౌపదిని నొక్కరథంబెక్కించుకొని, ద్రుపదరాజ మందిరంబున కరుదెంచిరి.

ద్రుపదుండు వారలకనేకవస్తువాహన నివహంబు అతి ప్రీతిం బుత్తెంచె. వారును బరార్థ్యంబులైన యొండువస్తువులం గైకొనక సాంగ్రామికంబులైన అసికార్ముకబాణ తూణీరాదులు గైకొనిరి. క్షత్రియోచిత మహాసనంబుల నాసీనులైరి.

వారల రాజపుత్రులంగా నెఱింగి సంశయాపనోదన పరుండై ధర్మతనయునకు ద్రుపదుండిట్లనియె.

"అయ్యా మీరు క్షత్రియులో బ్రాహ్మణులో మాయావులయి క్రుమ్మరుచున్న మంత్రసిద్ధులో కాక కన్యాపరి గ్రహణార్థంబు దివంబుననుండి వచ్చిన దివ్యులో యెఱుంగను. మాకు సందేహంబయి యున్నది. మీకులగోత్రంబెఱింగి కాని యిక్కన్యవివాహంబు సేయనేరము"

అన ధర్మజుండు రాజా మేము క్షత్రియులము. పాండు కుమారులము. నేను ధర్మజుడను. వీరు భీమార్జున నకులసహదేవులు. ఈమె కుంతీమహాదేవి.

అని యెఱింగించిన ద్రుపదుం డతిహర్షరసానందభరితుండయి పెద్దయుం బ్రొద్దునకు దెలిసి దయాళుండు శాస్త్రవిధి నుండవయ్యె. సపుత్రకుండైన ధృతరాష్ట్రుని నిందించె. సాదరప్రియభాషణంబులను అభీష్టసత్కారంబులను పాండవులం బూజించె.

ఒక్కనాడు పుత్రమిత్రసహితుండై ద్రుపదుండు సుఖాసీనులై యున్న పాండవుల కిట్లనియె "ఏ యుండి నా పుత్రికి వరుండవయ్యె. నా పుణ్యం బెట్టిది? నేడే కల్యాణము యిక్కడ కను ధనంజయుండు ధర్మవిధి పాణిగ్రహణంబు సేయు గాక".

అనిన ధర్మజుండు, "అదియెట్లు? మువు వివాహంబైన పదంపడి భీమసేనుండు వివాహంబైన నాటే యుధిష్ఠిరుండు వివాహంబగుం గాక. ముందరి స్త్రీకు నీనిబాణిగ్రహణంబు సేయ నెట్లగు?" అనగా ద్రుపదుండు "అట్లైనచో నీకే కృష్ణకు నీకు వివాహమగుము. ధర్మమార్గమెవ్వరిని దప్పరాదు గదా!"

అనిన విని ధర్మజుండు, "ఇక్కన్యను మేమేవురము వివాహంబయ్యెదము. ఇది మా మాతృనియోగంబు. అది మాకు నలంఘనీయంబు" అనగా విని విస్మితుండై ద్రుపదుండు,

"ఒక్క పురుషునకుం బెక్కండ్రు భార్యలగుట యెందునుం గలదు. పెక్కండ్రకు నాలొక్కతె యగుట ఏయుగములను నే కథలను వినియెఱుంగము. నీవు లౌకిక వైదిక ధర్మస్వరూపవేదివి. నీపలుకులు ధర్మవిరుద్ధంబులని పలుకనోడుదుము. అయి

నొక్కతె భార్యయయ్యె. ఇంతయేల! తల్లి గురులలోఁ బరమ గురువు. అట్టి తల్లిం జెనకు నపవిత్రధాగిణి నలవియగునే?

ద్రుపదుం డంత నిట్లనియె "త్రికాలప్రవర్తన జ్ఞానసిద్ధి గల కృష్ణ ద్వైపాయనుండు విచారించి యెద్దియానతిచ్చు నదియ మనకుఁ గర్తవ్యం" బనియె.

అంత వ్యాసమహాముని ద్రుపదున కిట్లనియె "ధర్మతత్త్వజ్ఞా ధర్మశాస్త్రానుసారంబుగ ధర్మమార్గంబు తప్పదు. దేవతామూర్తి యగు నీ త్రిపురాదేవి యన్యుల బలుకదు. ఇయ్యవి పురకుఁ గూతు నిచ్చి వివాహంబు గావింపుము. వీరికల తెలియంగలుగ నిష్టమగు నే నెఱుంగుదు" అని ద్రుపదునకు నేకతమ యిట్లనియె:

"తొల్లి యింద్రసేన యను పరమపతివ్రత మౌద్గల్యుం డను మునికి భార్యయై యుండె. కర్మఫలంబున నమ్ముని కుష్ఠవ్యాధి బాధితుండును రోగావృతుండును వలీపలితతనుండును దుర్గంధవదనుండును వికారరూపుండును నయ్యె. అయినను వానిఁ బరమభక్తి నారాధించుచుఁ దన యిచ్ఛాసుఖంబు గుఱుచుచు నింద్రసేన కాలంబు గడుపుచుండె.

దానిదయిన పతిభక్తికి మెచ్చి మౌద్గల్యుండు ప్రసన్నుండై "నీ కెద్ది యిష్టంబు వేడుము ఇచ్చెద"నన "మునీంద్రా నాకుం గామేచ్ఛ పెద్దయుఁ గలదు. నీవు తపశ్శక్తిం గామరూపధరుండవై మనోహారంబగు రూపంబు దాల్చి పంచధా విభక్తుండవై నాకు ప్రియంబు నేయుము"

అని యింద్రసేన పలుకఁగా నమ్ముని దానికిష్టంబైన విధంబున ప్రవర్తించి దానిం విడిచి ఘోరతపంబు చేసి బ్రహ్మమయుండయ్యె.

ఇంద్రసేనయు దృష్టిఁబొందక కొంతకాలంబునకు శరీరం బువిడిచి కాశిరాజను రాజునకుఁ బుట్టి, కన్యాత్వంబునఁ బెద్దకాలం బుండి, పతిఁ గోరి శంకరునుద్దేశించి యుగ్రతపంబు సేయుచుండె.

ఇట్లామె యత్యుగ్రతపంబుచేసి ప్రసన్నుండై యీశ్వ రుండు వరంబువేఁడుమనఁ బతికై నాకుఁబతిదానంబు ప్రసా దింపు మని యత్యంతభక్తియుక్తయై యైదుమారులువేఁడె. ఈశ్వరుండు కరుణించి, నీకు దేహాంతర మందు నైదుగురు పురుషులు పతులగుదు రనియె.

అంతనామె 'దేవా! యొకటిలోకపరుద్ధవరము పడయుజాల నని చెప్ప దయగుండెల్లనయె. "నాపచనప్రభావంబున నీకేపురుష తుల్యలైనను ధర్మభంగంబు కలుంగకుండును. ఓడకు"మనియె.

అంతని యింద్రసేన యీశ్వరుని యైదువురు పతులందును నాకుఁ గౌమారత్వంబును, బతిశుశ్రూషయు, కామేచ్ఛయు, సౌభాగ్యంబును బ్రసాదింపవలయుననిన దానికోరిన వరంబులెల్ల నిచ్చి చనియె. మఱియు నామెతపస్సు చేయునవుడయంబున ధర్మవాయు వాసవాశ్వినులు ప్రీతులైవచ్చి, ఆత్మదేహాంశజులను దానిఁ బత్నిఁగా గోరిరి.

ఇది వీరిపూర్వజన్మ వృత్తాంతంబు. నమ్మవేని వీరలఁ పూర్వదేహంబులఁ జూడు" మని కృష్ణద్వైపాయనుండు ద్రుప దునకు దివ్యదృష్టియిచ్చి చూపిన, సకలలావణ్యమూర్తులైన వారలకేవురకుఁ బత్నిగాఁ దపంబునేసిన యక్కన్యక పూర్వ దేహంబుచూచి, విస్మితుండై, హర్షించి యున్న ద్రుపదునకు వెండియు కృష్ణద్వైపాయనుండు,

"తొల్లి నితంతుఁడను రాజర్షి కొడుకులు స్వయంవరంబున నాళీకరంతి కన్యక నజిత యనుదానిఁ బడసి వివాహమైరి. తొల్లింటి మహాత్ములయందును నిట్టిచరిత్రంబులు గలవు. పాండవులకేవురకుఁ గ్రమంబునఁ బ్రతిదినంబు పాణిగ్రహణంబు సేయుఁడు." అని ద్రుపదున కెట్టకేలకు నొడంబఱచి చనియె.

అంత ద్రుపదరాజ పురోహితుండగు ధౌమ్యుఁడు వివాహంబు సేయునప్పుడు కన్యాత్వంబు దూషితంబుగాకుండ నీశ్వర వరంబునఁ గౌమారంబు గలుగ ద్రౌపదీకన్యకను గ్రమంబున ధర్మజ భీమార్జున నకుల సహదేవులతోఁ బాణిగ్రహణంబు చేయించె. ద్రుపదుండేవురకు వేలువేల సువర్ణ రత్న ఖచితాభరణ శయ్యాసన రథ కాంభోజ హయ దాస దాసీ జనాదులఁ బెక్కు పారితోషికంబుగా నిచ్చె. యాజ్ఞసేనియుఁ బాతివ్రత్యచర్యచేఁ బతులకు నతిముద మొనరించుచుఁ గుంతిదేవి మనస్సున కెక్కియుండె.

# ఆదిపర్వము

అటువాసుదేవుండు ద్రౌపదిని పాండవులేవురు వివాహం బగుట విని, సంతసిల్లి, వారికి నానాదేశ చిత్రవస్తువు లాదిగాఁ బెక్కులు కానుకలు గొనివచ్చియిచ్చి ద్రుపదపురంబుననుండె.

ఇట్లు పాండవులు ద్రుపదపురంబున సకలరాజ్య సమన్వితులై యొక్క వత్సరంబుండిరి.

ధృతరాష్ట్రుండు భీష్మద్రోణ విదురాది ప్రేరితుండై పాండవులం బిలిపించి కృష్ణునిసాక్షిగా వారి కర్ధరాజ్యమిచ్చి ఖాండవప్రస్థమున నివాసముగఁజేసె.

పాండవులు ధృతరాష్ట్రు శాసన బు. న. భీష్మాదుల యనుమతంబునను వాసుదేవ సహితులై ఖాండవప్రస్థమునకరిగిరి. అందు విశ్వకర్మ నిర్మించిన సుప్రశస్తమైన యింద్రప్రస్థపురంబున నింద్రవైభవముతో ధర్మజుఁడు పరాక్రమ ప్రణయ వశీకృతాఖిల రాజన్యుండై సుఖంబుండె.

అంతనొక్కనాఁడు నారదుఁడు పాండవేయుల పాలికిఁజనుదెంచె. అమ్మునిని పాండవులు పాంచాలీసహితులై యతి భక్తి పూజించిరి. మునియు వారి నాశీర్వచనంబుల నభినందించి, ద్రౌపదిని బోవంబనిచి, యేవురకు నేకాంతంబున నిట్లనియె.

"మీరనోన్యన్య నిత్యసౌహార్ద్రమతులు. సకల ధర్మజ్ఞులు. మీ కివుడు ద్రుపదనందన యొక్కతె ధర్మపత్నియై యున్నది. ఇయ్యది లోకాగమంబులందు విరుద్ధము. ఈమె కారణంబున

మీారు విప్రీతి పుట్టకుండ నుండవలయు. తొల్లి సుందోపసుందు లనువారలొక సుందరికతన విగ్రహించి తమలోనం బోరి హతులైరి.

కావున మీారేదేని నొక సమయము నేర్పరచుకొనుట సమంజసము."

నారదమహాముని పల్కుచేకొని, తమలో నొడంబడి, యేవ్వరయందును ప్రీతితో ద్రౌపది యొక్కొక్క యింట నొక్కొక్క యేడు క్రమంబున నుండునట్లును, ద్రౌపదియెవ్వరి యింట నుండునో అయ్యింటి వలనం బెఱవారు సనకుండునట్లు గను; నెఱుంగక చనిన వాండు పండ్రెండు నెలలు తీర్థసేవ చేయునట్లుగను; పాండవులు మునీంద్రునొద్ద సమయంబు చేసిరి.

ఇట్లు హితోపదేశంబుచేసి నారదుండరిగె. అది యట్లుండె.

అంత నొకప్పుడు శ్రీకృష్ణుచేత ననుజ్ఞాతుండై ధర్మరాజు రాజసూయ మహాధ్వరంబు చేయ నుపక్రమించె. అమ్మహాధ్వరం బత్యంత వైభవంబున సమాప్త ప్రయోగంబయ్యె.

ఆరాజసూయయాగ సందర్శనార్థము వచ్చిన దుర్యోధనుండును, శకునియు మయసభావిభవంబు చూచువేడ్క నింద్రప్రస్థమ్మునం గొన్ని దినంబులుండిరి. ఒక్కనాడు దుర్యోధనుండు దాని యపూర్వరామణీయకకు విస్మితుండై క్రుమ్మరుచు వివృతద్వారప్రదేశంబు సంవృతంబుగా వగచి చొరనేరడయ్యె. సంవృతద్వారంబు వివృతంబుగ చొరంబోయి తత్కవాట స్ఫటిక శిలాఘటితలలాటుండయ్యె. నీలాశ్మస్థగితంబైన విమల మణి

స్థలంబు జలాశయంబుగా నగచి పరిధానం బెగఁద్రోచుకొనియె. స్ఫటికదీప్తి జాల పరివృతం బైన జలాశయంబు స్థలంబుగా నగచి కట్టినవుట్టంబు దడియఁ జొచ్చి, క్రమ్మఱె. వానిం జూచి పాంచాలియుం బాండుసుతులు నగిరి.

ఈయవమానమే దుర్యోధనుని గేవల మున్మత్తుని జేసి వైచినది. వెంటనే యాతఁడు హస్తిపురికిఁ బోయె. సకల సుఖోపభోగవిముఖుం డయ్యె. పిదప శకుని మాయోపాయంబులం దెలివియు నాశనుగాంచి, తండ్రి నొప్పించి, సుహృద్ద్యూతార్థ మింద్రప్రస్థపురమునుండి ధర్మజుని, సోదరులను, బాంచాలిని రావించె. పాండవకౌరవు లతి ప్రణయంబున నద్దివసంబు గడిపిరి.

మఱునాఁటి యుదయంబున ధృతరాష్ట్ర నిర్మితం బైన సభను దుర్యోధనుఁడు చూపుచుండ ధర్మరాజు చూచుచు సుఖాసీనుఁడై యిష్టసంభాషణ క్రీడావినోదుఁడై యుండె.

ఆ సమయంబున దుర్యోధనుఁడు "ప్రొద్దుపోకయున్నది. సుహృద్ద్యూతం బొనరింతము. నాకై నీతో శకుని జూదమాడెడి. అతఁడొడ్డి యోడినధనరాసులన్నియు నీకు నీఁగలవాఁడ" నని పలికె. విధిప్రేరితుండై ధర్మజుండు సమ్మతించె. సుహృద్ద్యూతంబు ప్రవర్తిల్లె.

ధర్మజుండు బద్ధమత్సరుండై తన సర్వస్వము నొడ్డి యోడిపోవుచుండె. మహీతలంబంతయు నొడ్డి యోడిపోయె. తుదకు సహోదరుల నోడిపోయె. తన్ను ద్రౌపదిని గూడ నొడ్డి యోటువడియె. సభాస్థలంబంతయు సంక్షుభితమగుచుండె.

# ఏడవ ప్రకరణము

పాండవమహిషియొద్దకుఁజని భక్తివినతుఁడయి ప్రాతికామి ఈప్రకారంబుగా ననియె.

"ధర్మరాజు ధనసంపదలను, ధరణీరాజ్యమును, తమ్ములను, దాసులను, దన్నును, నిన్నును జూదంబున ధార్తరాష్ట్రులకు నోటువడియె. దుర్యోధనుని పంపున నిను దోడ్కొనిపో వచ్చితి. ఇపుడ రావలయును."

ద్రౌపది యిట్లనియె.

"ప్రాయుఁగలకులాంగనఁ గాని, ఎట్టిదుష్కృతవృత్తుఁగాని, భార్యనొడ్డి, యోటుపడిన ధర్మఁగలఁడా! ఇదికడు నపూర్వమైన విషయము. అకలంకశీలుఁడైన ధర్మజుండిట్లు సేయునే? అన్నా! ప్రాతికామీ! మొలుఁగుదేల నాయడుగు ప్రశ్నంబునకు వివరంబుగాఁ బ్రత్యుత్తరంబిమ్ము. క్ష్మావిభుండు మున్ను తన్నోటువడి, తన్ను నోటువడియెనో, లేక తన్ను నొడ్డి నన్నోటువడి, తన్నోటువడియెనో!

ఈ విషయంబు నీకుఁ స్పష్టంబుగాఁ దెలియదేని, నక్కృతవృత్తు ధర్మజుని నడిగి వచ్చిపిమ్మట నన్నుఁ దోడ్కొని పొమ్ము."

ప్రాతికామి సభకుఁ జని, ద్రౌపది ప్రశ్నంబు ధర్మనందనునకుం జెప్పిన, వృకోదర సహజుఁడు దుఃఖితచేతస్కుండగుటం జేసి యతండు ప్రత్యుత్తరంబీయడయ్యె.

అపుడు ప్రాతికామికి దుర్యోధనుం డిట్లనియె. "ఇది సంశయగ్రస్తమైన యర్థము. ఇచటికే వచ్చి ద్రౌపది తెలిసికొనును గాక. నీవు తడయక ద్రౌపదిని దోడ్కొని రమ్ము, పొమ్ము."

ప్రాతికామియు ద్రౌపదిపాలికిం బోయి, "దేవీ! నీయడిగిన యర్థము నిర్ణయించుటకు సభ్యులు నిన్ను రాఁబంచిరి. తోడ్తో రావలయును". అని విన్నపింపఁగాఁ బాంచాలి దుర్యోధనుని దుర్వ్యవసాయంబునకును ధర్మరాజు నమ్మతంబునకును గడునలిగె. కాని చేయునది లేక, ప్రాతికామి పిఱుందన యేకవస్త్రయు, నధోముఖయు, నవిరళగళితనయనజలబిందు సందోహయు నగుచు సభకు నరిగెను.

లజ్జితులై దుఃఖితాత్ములై ద్రౌపదిం జూడనోపక పాండవులు తలలువాంచి యుండిరి. పాండవుల వైలక్ష్యం బుపలక్షించి, సంతోషించి, దుర్యోధనుఁడు దుశ్శాసనుం బిల్చి, యతనితో "ప్రాతికామి వృకోదరునకు వెఱచు. నీవుపోయి ద్రౌపదినిటకు దోడ్కొనిరమ్ము." అని పంచిన నిర్దయాత్ముఁడును బాపనిరతుఁడును నగు దుశ్శాసనుఁడు ప్రయుక్తుఁడై సుముఖుం డగుట యెఱిఁగి, ద్రౌపది కమభయంబు నొంది, వడంకుచు, అతిరయంబున గాంధారి యొద్దకుఁ జనియె.

కౌరవాధముండగు దుశ్శాసనుఁడు ద్రౌపది పిఱుందన పాఱి 'ఇంక నెక్కడికిఁ బోయెదవు? ఏమియుఁ బలుకఁ దగదు. దురోదరంబున శకుని నిన్నోడించె. దుర్యోధనుని యర్థమవైతివి. నీపతులు పాండవులు నిన్నును బృథ్విని దమ్మును గోల్పడిరి.

అనుచు డాయవచ్చె. ద్రౌపది కోప దుఃఖ భయంబులు ముప్పిరిగొన "నేను రజస్వలను. ఏకవస్త్రను. నన్ను ముట్టకుము. గురు బంధు జనాధిష్ఠితంబగు సభకు నెట్లు రానేర్తు" అనియె.

దుశ్శాసనుండును "నీవేక వస్త్రవైననేమి? విగత వస్త్రవైననేమి? నిన్ను నెట్లునుం దోడ్కొనిపోదు" అనుచు బలాత్కారంబున

ఉ॥ "అవ్యాజానన గర్వకుల నందనుఁడు గడంగి రాజసూ
యావభృథంబునందు వసుధామరమంత్ర పవిత్రవారి ధా
రాప్లుతిఁ జేసి పావనములైన శిరోజములన్ గ్రహించి పా
పాత్ముఁడీడ్చి తెచ్చె సభకందఱు విస్మయమంది చూడఁగన్."

ఈప్రకారంబున దుశ్శాసనాపకృష్టయయి వికీర్ణవేణియు, వివర్ణవదనయు నయి, కర్ణ దుర్యోధన శకుని సైంధవాది దుష్టభూయిష్ఠంబైన సభకు వచ్చి, కోపలజ్జా పరవశయై ద్రోపది యిట్లనియె.

ఉ॥ "ఈసభను దైవయోగ హతుఁడై చూడ్య సవశ్యము ధర్మసంపదా
ధారను కాని ధర్ముఁడు ధర్మపథంబది యేల తప్పుఁ ద్రో
ణుఁడు గురువృద్ధులారా! భృశకోపనుఁ డీతఁడు నన్ను నేలదు
ర్జనుఁడిటకీడ్చి తెచ్చె, నవిచారపరుండయి దుర్మదంబునన్.

చ॥ ఇదియనుచితంబు గాదనక యిక్కురుముఖ్యులు చూచుచుండ, దు
ర్మదుఁడయి వీఁడు నన్ను నవమానితఁ జేసెడు; సర్వధర్మసం
విదులన నున్న యీభరతవీరుల వంశము నేఁడ ధర్మ సం
పద నతినింద్యమయ్యె ననిభామిని కృష్ణ దలంచె భీతయై."

జగత్త్రయ జయ భుజవీర్య సనాథులైన నాథులు గలిగియు ననాథయుంబోలె ద్రౌపది భయార్తయై యార్తజన శరణ్యుండైన జనార్దనుని దలంచుచుండెను.

ఆమెం జూచి దుఃఖితుండై భీమసేనుండు పాపద్యూతంబునందు అధర్మప్రవర్తకుండగు ధర్మజుని బాహుదాహంబు సేయవలయునని రోషావేశంబునం బల్కెను. అర్జునుండు సముచితవాక్యంబుల నతని నూరార్చుచుండె.

ఇట్లు దుఃఖితులగుచున్న పాండవులను, దుశ్శాసనాపకృష్టయై సభాంతరంబుననున్న ద్రౌపదింజూచి, వికర్ణుండను వాఁడు సభ్యుల కిట్లనియె.

ఇప్పుడు ద్రౌపదీప్రశ్నము బుద్ధిమంతులు విచారము సేయవలయు. అవిచారమునఁ బ్రవర్తిల్లుట నరకహేతువగును. కురుగురువృద్ధులైన భీష్మ ద్రోణ కృపాచార్యులును బలుకరైరి. సభాసదులెల్లను నూరకుండిరి. ఔఁగాక!

నేనిందు ధర్మనిర్ణయంబు చేసెద. జూదంబు వేఁటయుఁ బానంబును బహుభక్షణాసక్తియు ననునాలుగు దుర్వ్యసనంబులు. అందుఁ దగిలిన పురుషుండు ధర్మువుందప్పి వర్తిల్లు. అట్టివాని కృత్యంబులు చేకొనందగవు. వ్యసనవర్తియగు ధర్మజుండు పాండవుల కందఱకు సాధారణ ధనంబైన పాంచాలిం బణంబు చేసె. కావున ద్రౌపది యధర్మవిజిత. మఱియు నేకవస్త్రయగు నామె నిటఁ దోడ్కొని తెచ్చుట యన్యాయంబు."

వాని పలుకుల కోడంవడక కర్ణుం డిట్లనియె.

"ఇందఱు పెద్దలుండఁగఁ జిఱుతవానికింత గఱువతనంబేల? నీవు ద్రౌపది యధర్మవిజితయని పలికితి. ధర్మజుండు తనసర్వస్వములు నొడ్డి యోటువడ్డప్పుడు ఈమె దానికి వెలిగాదు. కావున ధర్మవిజితయే. మఱియు నేకవస్త్రను సభకుఁ

దోడ్కొనివచ్చుట యధర్మంబంటివి. భార్యకు నొక్కరుండె భర్త. దైవాధిష్ఠితుండై యుండు. ఇది యనేక భర్తలు గలది. కావున బంధకి నాఁబడు. ఇట్టిదాని విగతవస్త్రం జేసి తెచ్చినను ధర్మవిరోధంబు లేదు.,,

ఈ కర్ణకృత వికర్ణప్రత్యాఖ్యానంబువిని దుర్యోధనుండు దుశ్శాసనుం బిలిచి "యిప్పాండవులయు ద్రౌపదియు వస్త్రంబు లపహరింపుమనిన దోడ్తో దానినివిని బసిమిసెడియున్న పాండుసుతులు తమపై పుట్టంబులు మున్న తీసివేసిరి.

హృదయ మదరుచుండ, శరీరము కంపించుచుండ, "నేనింకేమిసేయుదు. నాకిట దిక్కెవ్వరు" అని ద్రౌపది దయానిధియగు గోవిందునే శరణుసొచ్చెను.

సద్గర్హితుండగు దుశ్శాసనుండు యుక్తాయుక్త విచక్షణ మిసుమంతయు లేక, శంకారహితస్వాంతుడై ద్రౌపదిపుట్టంబు నొల్చె. తోడ్తోనట్టిదియవస్త్రం బమ్మహాపతివ్రత జఘనమండలంబు పాయకయొప్పుచుండె. దుశ్శాసనుఁడు విసువక వస్త్రంబు లొల్చుచునేయుండెను. అట్టివియ వస్త్రంబులా పెజఘనమండలంబును బాయకయేయుండె. ఇట్లు శపనీతంబులైన వస్త్రచయంబు పర్వతోపమానమయ్యె. దుశ్శాసనుఁడు నింక నొలువనోపక యుక్కడఁగి లజ్జఁబొందియుడిగె. సభ్యులెల్లరుదిత సమ్మదులై

"సాధ్వీమతల్లీ! నీజన్మము ధన్యము, నీచరిత్రము నిష్కలంకము. నీ పాతివ్రత్యమద్వితీయము. నీమాహాత్మ్యమనంతము" అని మనమ్ముల దలంచుచుండిరి.

అట్టి యవసరంబున భీమసేనుండు ముడివడు కనుబొమలతో నంత్యకాల కాలునిభంగి దంతసందష్టదారుణ ముఖుండై యెల్లసభ్యులు వినుచుండ నిట్లనియె.

మ॥ కురువృద్ధుల్ గురువృద్ధబాంధవులనేకుల్ చూచుచుండన్ మదో
ద్ధురుఁడై ద్రౌపది నిట్లుసేసెఁ ఖలుఁడు దుశ్శాసనుండ్ లోకభీ
కరలీలన్ వధియించి తద్విపులవక్షశ్శైలరక్తౌఘని
ర్ఝర మూర్వీపతి చూచుచుండ నవిశాస్వాదింతు నుగ్రాకృతిన్,

ఇట్లు చేయనైతి నేని నాకు పితృపితామహులు గతికిఁ దప్పినవాఁడ నగుదుడు."

పవనతనయుని యతిమానుషంబగు నీ మహాప్రతిజ్ఞకు సభ్యులెల్లరు దిక్కులు చూచుచు దిగ్భ్రమముఖరిత ముఖులగుచు సపుత్రకుండగు ధృతరాష్ట్రు నిందించుచుండిరి.

అయ్యవసరంబున నుద్గతబాష్పనయనుండగుచు, నెల్లవారిని వారించుచు విదురుం డిట్లనియె.

"ఈ ధర్మసభయందుఁ గల సుమతులకు ద్రౌపదీ ప్రశ్నము విచారింపఁదగి యున్నది. ధర్మసందేహము తీర్పని నాడు సభ్యులగు సజ్జనులఁ బాపమొందును.

బాలుండయ్యు నీవికర్ణుండు దేవమంత్రివలె యథావిధిగా ధర్మము తెల్పె. ఈతనిబుద్ధి చేకొనుట సమంజసము.

సభకు వచ్చి, యడుగఁబడియు, నెఱిఁగియు, ధర్మసందేహము తీర్పని సభ్యులనృత దోష ఫలమునం దర్ధము వొందుదురు. లాభలోభ పక్షపాత బుద్ధిచే నెవండు మిన్నకుండునో వాఁ డనృతదోషఫలమంతయు ననుభవించు. కాన

మీరాయను ద్రుపదరాజపుత్రి యడిగిన ధర్మనిర్ణయంబు దప్పక చేయునది.”

అని విదురుండుపలికినను దుర్యోధను భయంబున సభ్యు లెవ్వరు పలుకక మిన్నకయుండిరి. భీష్మాది కురువృద్ధులను, ద్రోణాదిగురువర్యులును బలుకరైరి.

ఇదియంతయుం జూచి ద్రౌపది దుఃఖితయై “ఆనాఁడు స్వయంవరమున నావిధముగా సర్వభూపాలురచేఁ జూడఁబడితి. పాండవుల ధర్మపత్నినై గోవిందు చెలియలినై సభామధ్యంబున సర్వమహీధవ సమక్షమున నేఁడీ యవమానింపబడి సిగ్గున పరిభూత నగుదునా!

ఎవ్వరేని నావాక్యములకుఁ బ్రతివచనము పల్కువారు లేరా! ధన్యులార! ధర్మభంగభయాతురులు సంకేసి రేని మాటలు పల్కుఁడు. నేను దాసినా లేక అదాసినా! ఎట్లగునో చెప్పుఁడు” అని వనరుచుండె.

ఆపెంజూచి శాంతనవుండు “మహాత్మ్యా నీ ప్రశ్నంబునకు సదుత్తరంబు యుధిష్ఠిరుఁడె చెప్పఁదగును. కానినాఁడు ధర్మసూక్ష్మత యెవ్వరికిం గానఁగ నశక్యంబు. కౌరవుల సాహసములు వేగం బిప్పాప ఫలం బనుభవింతురు” అని యనియె.

రాధేయుం డయ్యవసరంబున నర్జునాదులం జూచి నగుచు “సుందరీ! అయిదుగురు భర్తలకంటె నొక్క భర్త లగ్గు. జూదములో నాలి నోడిపోవనివాని నింకేని నొకని వరింపు” మని యుల్లసము లాడుచుండ, దుర్యోధనుండా మహాసాధ్విని, విభీతహరిణాక్షిని, గలాప విభాసికేశభారను,

తన రమ్య వృథూతుతలంబునెక్కంగా రమ్మని సన్న చేసెను. ఆ సన్నను దూరమ్మునుండి చూచి లయసమయదండధర నిర్దయుండై, సభ్యులెల్లరు విస్మయసంభ్రమ సంభృతులై తన పల్కులు వినుచుండ భీమసేనుండిట్లనియె.

ఉ॥ ధారుణి రాజ్యసంపదమదంబునఁ గోమలిఁ గృష్ణఁ జూచి రం
భోరునిజోరుదేశమున నుండఁగఁ బిల్చిన యుద్ధురాత్ము దు
ర్వారమదీయబాహుపరివర్తిత చండగదాభిఘాత భ
గ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్.

ఇట్లు సర్వజన భయానకంబుగా శపధించి భీమసేనుండా యుధంబులున్న వలసికి దృష్టులు సలుపుచు ధర్మజు మొగంబు చూచుచుండె. ఆరౌద్రాకారంబు చూచి. భీష్మ ద్రోణ విదురాదులిది కోపంబునకు సమయంబుగాదని యాతని ప్రశాంతచిత్తుం జేసిరి.

అట్టియెడ ధృతరాష్ట్రుని యగ్నిహోత్రాయతనంబున వఱిళులరచె. అగ్నులారిపోయె కౌరవస్త్రీతతి హృదయములు శోకతప్తములయ్యె. ధార్తరాష్ట్రుల శయ్యాగారంబులయందుఁ గాక ఘూక ఘూత్కారంబులెగసె.

ఈ మహోత్పాతంబులన్నింటిఁ జూచి కురుకులవృద్ధులు ధృతరాష్ట్రకుమారులు కరిష్టములు పుట్టెనని తమతమ మనస్సుల భావించుచుండిరి.

దీనినంతయు నెఱింగి గాంధారి విదురుం దోడ్కొని ధృతరాష్ట్రు పాలికింబోయి, పాండవుల పరాజయంబును, ద్రౌపదీ

పరిభవ ప్రకారంబునుఁ దుర్నిమిత్తోత్పత్తియుఁ జెప్పె. ధృతరాష్ట్రుఁడదరిపడి దుర్యోధనుఁబిలిచి యిట్లనియె.

చ॥ పతిమతివ్రతన్ సభఁ దపస్వినిఁ బాండవధర్మపత్ని ధ
ర్మరత, నయోనిజన్, బ్రకృతమానవభామినిగాఁ దలంచి, ద
ప్పరతములవల్లఁ గాదగునె కాల్యముడుం గ్రుత్తు, దుష్టశాసనం
జెరిగితి నీనిమిత్తమునఁ బెద్దయుదుఃఖితులైరి పాండవుల్.

నీవు వారలవలన క్రోధంబువిడువుము”. అని దుర్యోధను వారించి, సకలబాంధవ హితంబు సేయుమని పలికి, ద్రౌపది గావించి శాంతవచనంబుల నిట్లనియె.

“సుందరీ! నీవు నా కోడండ్రయందు దక్షురాలవు. అత్యానందంబున నీకుఁ బ్రియంబు సేయనుంటి. నీకెద్దియిష్టమో వేఁడు కొనుము”.

అనిన ధృతరాష్ట్రునకు ద్రౌపది యిట్లనియె. “ నాకు వరంబు ప్రసాదించుట నీకుఁ బ్రియంబగుచో మహానుభావుండు ధర్మతనయుం దాస్యంబువలనఁ బాయునట్లుచేయునది. ఇదియె నా యిష్టంబు.” అనిన నిచ్చితి నింక రెండవవరంబు వేఁడుకొను మనిన ద్రౌపది యిట్లనియె.

“ ధర్మరాజు నలువురు తమ్ములును దమ వస్త్రముల తోడను, తమ శస్త్రములతోడను దాస్యంబువలనఁ బాయునట్లు చేయునది.” .

అనిన ధృతరాష్ట్రుండు “నీ కోరిన వరంబిచ్చితి. ఇంక మూఁడవవరంబు వేఁడుమనిన” ద్రౌపది యిట్లనియె.

"వైశ్యసతి యొక్క వరంబును, క్షత్రియసతి రెండు వరంబులును, శూద్రసతి మూఁడు వరంబులును, విప్రసతి నూఱు వరంబులును వేఁడవచ్చును. కాన నాకు నింక వేఁడఁ జనదు."

అనిన ధృతరాష్ట్రుండు ద్రౌపది గుణంబులకు దిగ్భ్రమ జెందుచు నంతసిల్లి, యనుజ సహితుండగు ధర్మరాజును రావించి, "నీ సర్వజన సంపదలు, రాజ్యంబును గొనిపోయి యెప్పటియట్ల యింద్రప్రస్థపురంబున సుఖంబుండుము. నీకు లగ్గయ్యెడు. అరుగుము. మఱియు నీవు ధర్మంబు లన్నింటి నెఱింగినవాఁడవు. ఎఱుక లేని నా కొడుకులు నీ కెగ్గు సేసిరి. దీని మఱచునది. ఏను బుద్ధిలేక జూదం బొనర్పించితి. అల్పబుద్ధి నత్యుండనగు నన్నును మీ తల్లి గాంధారినిఁ దలంచి, దుర్యోధనాదుల దుర్గుణంబులం దలంపక యెప్పటియట్ల స్నేహంబున వర్తించుచుండునది.

సత్యశౌచ హితుండగు విదురుండు మంత్రిగా నీవు హితుండవుగాఁ గురుకులంబునకు లగ్గయ్యెడు' అని ధర్మరాజును బాండురాజ్యంబునకు నియోగించెను.

ఇవ్విధంబు దెలియు భీమసేనుఁ డెఱింగి "సతి కారణంబుగా రాజ్యప్రాప్తి ధృతమయ్యె ననుటకంటెఁ గష్టంబు మఱియొండు గలదా! యని కోపఘూర్ణితరక్త నేత్రుండై, "ఉగ్రసంగరాంగణంబునఁ బరాక్రమంబున శత్రువరులఁ జంపి రాజ్యముగొందు" ననుచు సింహంబు భంగి విజృంభించుచుండె. ధర్మరాజం డాతని సాంత్వనవచనంబుల వారించి, తమ్ములుం దానును ద్రౌపదీ సహితంబుగాఁ గాంచన రథారూఢుండై యింద్రప్రస్థపురంబునకుం జనియె.

దుర్యోధనుండు సుప్రచతుష్టయంబుతో ధృతరాష్ట్రు నొద్దకుంజని, " ఇంకఁ బాండవులకు నెంతి లగ్గొనరించియు హితుల మయ్యెదమె? ఆశీవిషంబుల వలిగించి కంఠసమీపం బున విడుచుచున్నట్లు వారిని విడిచి పడిచివచ్చి ద్రవ్యంబు దప్పితిమి. కావున వారిని మరల బిలిపించి, యనుద్యూత పరాజితులం జేసి, భూమి వెలువరించుట కార్యంబు" అన ధృతరాష్ట్రు డట్లే కేనియు నొడ బడఁ జేసె.

పాండవులు మరలఁ బిలువంబడి దుర్యోధనుడు "పున ర్ద్యూతాగంబు నిట్లు పిలిపించితి ఇట్టి ప్రారబ్ధంబైన పణంబు దీని నోడిన వారలు నారచీరలు కట్టి, కందమూల ఫలాశనులై బ్రహ్మచర్యంబున పండ్రెండేండ్లు వన వాసంబు సేసి, పదమూడవ యేఁ డజ్ఞాతవాసంబు చేయునది. అందెవరైన బడిరేని వెండియు పండ్రెండేండ్లు వనవాసంబు, నొక్కయేఁ డజ్ఞాతవాసంబు చేయుదము. ఇట్లొప్పుదేని జూదం బాడుద" మనియె.

ధర్మనందనుండు నొక్కెడ నాడుటకు చెయివిడి నోటువడియె. ఇట్లు పునర్ద్యూత పరాజితులైన పాండవులు తమ రాజ్యోప భోగంబులు విడిచి బ్రాహ్మణ సుహృద్బాంధవ జనోపాస్య మానులై వనంబులకుం బోవ సమకట్టిరి.

# ఏబదిమిదవ ప్రకరణము

అట్లు పాండవులు పరిత్యక్తవిభవులై గజపురంబు వెలువడు సమయంబున భూకంపాద్యనేక దుర్నిమిత్తంబులు పుట్టె. వానిప్రకారంబెఱింగి ధృతరాష్ట్రుండింకేమి యనిష్టంబులు పుట్టనున్నవియో యని వగచుచుండె.

నిజరూపాలోకనజనచయదాహభయంబునం జేసి ధర్మరాజు వస్త్రాంతమున వదనంబు గప్పికొనియె. సంగరాంగణంబున బాహుబలదర్పము సూపఁగంటినని భీముండు బాహువుల నతి విశాలములుగఁ జేసె. ఇంతకంటె దట్టముగ బాణంబు లేసి పగరఁ జెఱతునని యర్జునుం డిసుములుసల్లుచుండె. నిజసుందరరూపంబుచూచి జనులు దుఃఖింపకుందురు గావుతమని నకులుండు ధూళిధూసరిత శరీరుండయ్యె. దీనంబైన తనయానవంబు మూడఁగలుగు నెగ్గువారింపఁ దలఁచి సహదేవుండవనతవదనుండయ్యె. ఆరీతిగా వారేగుసమయంబున

చ॥ "తఱసినయేకవస్త్ర పరిధానముతోడ విముక్తకేశియై
దొడరుచు దుఃఖభావమున ద్రోపదివోయె మహాశతాంబువన్
బడిన నికేశమిత్రసుత బంధుజనంబుల శోకవేదనం
గడుకొని, బిట్టులేగుదుట, కౌరవభామినులంచు దెల్పుచున్.

పురోహితుండగు ధౌమ్యుండు రౌద్రయామ్యసామోద్గతుండై భారత మహారణనిహతులగు కౌరవుల పరలోక విధుల సూచించుచు నేగెను.

అప్పురంబునంగల పౌరులెల్లరుఁ బాండవుల ననుగమింపం జూచియు ధర్మజుచే మధురంబుగ నివారితులైరి. భూసుర ప్రకరంబుమాత్రంబు పట్టుపట్టి ధర్మజునే యనుగమించుచుండిరి. అట్లు చని చని పాండవులు బ్రాహ్మణసహితంబుగాఁ గామ్యక వనమున కేగిరి.

ఇట్లుండ నొకనాఁడు యాదవపాంచాలాదులు పాండవులం జూడఁ జనుదెంచిరి. వారెల్లరు నత్యంత ప్రియంబుతో అన్యోన్య హితభాషలాడునమయంబున ద్రౌపది కృష్ణుపాలికిం జని యిట్లనియె.

“కృష్ణా నీవు సర్వశరణ్యుండవు. నీయంతఃకరణ ప్రవృత్తికి నగోచరంబెద్దియు లేదు. అయినను నాపరాభవంబెఱింగించెద. దయతో వినవేడెద.

పాండు మహీపతి కోడలనై పాండవుల ధర్మపత్నినై, విశేషించి నీసోదరినై యుండియు దుశ్శాసనుచే సంసత్సభలోఁ దలపట్టి యీడ్వంబడి పరిధాన మొలవంగఁబడితి. ఒరులువోలెఁ బాండవులవుడు నూచుచుండిరి. ఆపగాతనూజుఁ డాదిగాఁగల్గు వృద్ధబంధుజనులు చూచుచుండియు మిన్నకుండిరి. కాని నోరెత్తరైరి. భర్తృ భ్రాతృ పుత్ర బంధుజనంబులు కలిగియు నాకు లేనివారైరి. అట్టియెడఁ గర్ణుండు నన్నుఁ జూచి నగియె. వాని నగవు దుశ్శాసనుని చెయిదికంటె దారుణ శిఖయుం బోలె నామనంబు నేచుచున్నది.

కృష్ణా! ఇందు వింతయేమి! బాల్యంబునుండి యనేకాపకారంబులు దుర్యోధనుఁడు చేయుచునేయున్నాఁడు. ఇపుడు

రాజలోకసమక్షంబున నధర్మద్యూతంబునఁ దాస్యసీకృతులఁ జేసినను పాండవులు పరాక్రమ పరాఙ్ముఖులై యున్నారు. ఇంక నాపరిభవంబెట్లుడిగెదరు?’

అని పాణిపల్లవంబున బాష్పసమ్మార్జనంబు సేయుచున్న దాని నంద ఱోదార్చిరి.

కృష్ణుండు పాండవుల నోదార్చి, విశేషించి ద్రౌపదికి ధైర్యంబు గలపి పాంచాలురతోఁ గూడి చనియె. పాండవులును గామ్యక వనంబునుండి ద్వైతవనంబున కేగిరి.

అందుఁ బాండవులు దుఃఖోపశమనంబులైన కథలు చెప్పికొనుచుఁ గాలంబు ద్రోయుచుండిరి. ఎడనెడ ధర్మరాజునకు ద్రౌపది కర్తవ్యంబు తెఱంగు సూచించుచు క్షమకంటెను తేజంబు ప్రధానమని నుడువుచుండెను.

తమ్ముఁవీడి తపస్సుచేయనేగిన యర్జునునింజూడ ధర్మరాజాదులు ద్రౌపదీసహితంబుగా గంధమాదనపర్వతమున కభిముఖులై యరుగుచుండిరి. ఘోరప్పర్వతంబు సమీపించిరి. అంత నొక్క మహామారుతము వీచెను. మహారేణుపటలంబంధకారంబును బోలె నీరంధ్రంబై కప్పె. ధాత్రీరుహశాఖలు విఱిగి పడుచుండె. వారును దరు గుల్మలతావితానంబులు కరతలంబులం బాయం ద్రోయుచు విశాలతరు ధృఢమూలంబు లాశ్రయించిరి. యగ్నిహోత్రంబుతో ధౌమ్యధర్మజసహదేవులొక్కచోటను, భీమసేన ద్రౌపదు లొక్కచోటను, నకులబ్రాహ్మణు లొక్కచోటనుగా నందఱు వేఱువేఱనుండిరి.

తోడ్తోఁగాఁపుత్తోడి వాన పెద్దయుం బ్రొద్దు వర్షించె. అదియుడిగిన యనంతరము నందఱునొక్కచోటికిఁ బచ్చి యెప్పటి యట్ల చనుచుండిరి. అతివిషమశిలా సంకటపథంబున నడువ నేరక ద్రౌపది యొకచో మూర్ఛితయయ్యె.

పవనతనయుండక్కోమలి నెత్తికొని యజినాస్తరణంబు పయింబెట్టి కదళీదళంబుల వీచుచుండె. ఆమె పల్లవపాద తలంబులు హిమకరంబుల మెత్తన కవల వారలొత్తుచుండిరి.

అట్టి యవసరంబున ద్రౌపదింజూచి దుఃఖితుండై ధర్మతనయుండు.

“మృదుసుకుమార శయనతలంబుల శయనించుసిత్తన్వి పరుసంపురాలయందుఁబడి తీవ్రవేదన బొందినయది; “మహాపురుషులు పాండవులకుఁ బ్రియభార్యయై సుఖముండు”నని ద్రుపదుండు సంతోషపడియుండు. ఇట్లగుట యెఱుఁగ నేరఁడుగదా!” యని విలాపించుచుండ శీతపవన సేవ్యమానయై ద్రౌపది మూర్ఛ తేరె.

ఆమె నాశ్వాసించి ధర్మరాజుండు భీముని కిట్లనియె. “ఈ రాజపుత్రిని పాషాణదుర్గమపథంబులఁ జనఁగా నేరదు ఏమి చేయుదము!”

భీముండపుడు నిజపుత్రుండగు ఘటోత్కచుం దలంచె. అతఁడును రాక్షససైన్యాన్వితుండై తత్క్షణము వచ్చె. భీముండు వానిం గౌఁగిలించుకొని యిట్లనియె.

“ఇది భవన్మాత. అధ్వగమన శ్రాన్తయై యున్నది. కడు నబల. దీని నీవెత్తుకొని మా సమీపంబునఁ జనుదెమ్ము.”

వాఁడును "ఇమ్మార్గంబతి పరుషశిలా విషమంబు. పాదచారుల కగమ్యంబు. కావున మిమ్మందఱ నెత్తికొని యుత్క్రమంబున నఁగెద." అని ధౌమ్య పాండవ ద్రౌపదులం దానెత్తికొని, బ్రాహ్మణుల నెత్తికొనఁ దనబాలకులం బంచె.

అట్లందఱు గగన మార్గంబునఁ జని బదరీవనంబు గని యందాఱు దినంబులు నివాసంబు చేసిరి. అంత నొక్కనాఁడు భీమద్రౌపదులు గంధమాదనసాను రత్నవేదుల విహరించుచున్నచో లలితమగు సహస్రపత్ర కమలం బొండు వారిచెంగటఁ బడియె.

ఆ సౌగంధిక కమలంబు చూచి దాని యపూర్వ రామణీయకంబునకు, అనన్యకుసుమ సాధారణంబైన సౌరభ్యంబునకు నోటువడి ద్రుపదరాజపుత్రి, "ఉత్కటా! యిది యొక్క పుష్పమయ్యు నపూర్వంబై, మనోజ్ఞయనానందకరంబై యున్నది. ఇట్టి కుసుమంబులు కడుం బెక్కులు కావలదె! అవి కురంగటం గలవేని తెచ్చి యిచ్చి నాకు మనః ప్రియంబు సేయుము" అని భీము బ్రార్థించె.

భీముండును నామె యభిమతంబు చేయంగడంగి ధనుర్బాణంబులు ధరించి యక్కమలంబు తెచ్చిన గాడ్పున కభిముఖుండై గమనవేగం బొప్పఁ జనుచుండె.

అట్లు చనిచని కొండొకచో నొక్క సరోవరంబు గని యందుఁ గృతావగాహుండై నవనలిన దళమృణాళవలయాలంకృతుండగుచు దాని వెలువడి శంఖధ్వానంబు చేసె.

తత్ప్రాంతంబున గుహాశయనుండై హనుమంతుండు నిద్రించుచు శంఖధ్వానంబువిని ప్రియుండై మార్గనిరోధంబుగా శయనించి లాంగూలలీలాచాలనంబు జేసె.

తద్ధ్వనికి భీముండు విస్మితుండై చని హనుమంతుం గాంచి, కపివరులాంగూలంబు నడ్డంబుగానుండ నెత్త బోదమని యత్నించి యెత్త నేరక, కృతప్రణాముండై "నీ వృత్తాంతం బెఱింగింపు" మని ప్రార్థించె.

కపివరుండును నిజవృత్తాంతం బెఱింగించి "నన్ను రణ రంగంబునం దలంచునది. నీ యందు సౌహృదంబున నాహవం బులో నతిరథుండైన యర్జును రథధ్వజంబు నందుండి మీ బల పరాక్రమంబులం జూచుచుండు" నని భీముం గౌగిలించుకొని వానికి సౌగంధిక సరోవరంబు మార్గంబు జూపి చనియె.

తదాలింగనంబున విగతశ్రముండును నవపుంజనశక్తి యుక్తుండునై భీముండు సౌగంధిక పద్మవనముం జొచ్చి దాని రక్షకుల బరిమార్చి, వైడూర్యనాళంబులైన కనకకమలంబులు, తన్ను వెదకికొనుచు ధర్మరాజాదులతో వచ్చుచున్న ద్రౌపదికి నిచ్చె.

పాండవులు తత్ సమీపంబున నివాసంబు చేసికొని యందు విహరించుచుండిరి. అంత నొకరాక్షసుండు బ్రాహ్మణ రూపధరుండై పరశురామశిష్యుండ నని పాండవుల సేవించు చుండె.

ఒకనాడు భీముడు మృగయా వినోదార్థ మడవికేగినతరిగ బ్రాహ్మణవేషధారి యగు జటాసురుండను నా రక్కసుడు

ధర్మజ నకుల ద్రౌపదుల నెత్తికొని మహాజవమునఁ బఱుగిడు
చుండె.

సహదేవుండు భీముని బిలిచికొని వచ్చె. భీముండటు పోవుచున్న రక్కసునితో ఘోరసంగ్రామంబు చేసి వానిం బుడమిం బడఁ జేసి ధర్మరాజాదుల రక్షించె.

పాండవులటఁ గొన్నిదినంబులుండి గంధమాదన పుణ్యతీర్థావలోకనపరులై మాల్యవంతాదులఁ జూచుచుఁ బోవుచుండిరి.

అందొక్కనాఁడు అశ్వరథియను పుణ్యనదివలన మారుతానీతంబులై సువర్ణమయంబులై తమ ముందటంబడిన పంచవర్ణసురభికుసుమంబులం జూచి యందఱు విస్మయంబందిరి. పిమ్మట నేకతంబున నొక్క శశికాంత శిలాతలంబుపై నున్న భీమసేనునకు ద్రౌపది యిట్లనె.

"ఇక్కుసుమంబులు నాకుఁ దెచ్చియిచ్చి మనఃప్రియంబు సేయుము". భీముండు తత్క్షణంబ చని చక్రవాళ నగసమున్నతంబైన గిరిశృంగంబెక్కి శంఖధ్వానంబుచేసి, వఱతెంచిన రాక్షససేనల నాశముచేసి, మణిమంతుండను వానియుక్కడంచి త్రుంచి పూవులందుంచుకొనిపోయి ద్రౌపదికొసంగె.

# తొమ్మిదవ ప్రకరణము

అర్జునుండు అభీష్టప్రదాయకంబుగాఁ దపంబొనరించె. దేవేంద్రాదులకుఁ బ్రియంబుగా నివాతకవచ కాలకేయాదుల వధించె. దివ్యబాణములతో ప్రయోగోపసంహార విజ్ఞానముతో, నర్జునుఁడు ధర్మరాజాదులకడకు వచ్చెను.

పాండవు లామరుభూమియందు సరస్వతీమహానదిని నను దినస్నానపానాది విశేషంబులఁ బరితోషంబునొందుచుఁ గొన్ని దినంబులు నసియించిరి. తదనందరంబ ద్రౌపదీ ధౌమ్యాది సహితులై కామ్యక వనంబునకు బోయి యచటి మునులచేత నభినందితులై సముచితప్రరనంబుల నుండిరి.

అంత నొక్కనాఁడు అప్రమేయ తేజఃప్రభావ విభాసి అగు మార్కండేయ మహాముని ధర్మరాజునకు "శ్రీకృష్ణ భగవానుఁడు భవదీయ దర్శనార్థం బీక్షణంబ యరుగుదెంచు" నని చెప్పుచుండఁ, జారుపతాకాది భూషితగగనమైన దివ్యరథంబున, సత్యభామ నిజోత్సంగ తలంబునందు వెలుగొందుచుండ విజయం చేసెను.

తోడ్తో రథావతరణంబుచేసి ధర్మనందనున కభివందనం బాచరించి, భీమార్జున నకుల సహదేవులం గౌఁగిలించుకొని, ద్రౌపది గౌరవించి ధౌమ్యాదిమహీసురులచేత నభినందితుండై అభీష్టకథాగోష్ఠిం బ్రవర్తిల్లుచుండె.

అట్టియెడ కృష్ణవల్లభయైన సత్యభామయుఁ బాంచాలియు నేకతంబ ప్రియసల్లాప నాసక్తలై యుండిరి.

సత్యభామ ద్రౌపది కిట్లనియె.

"నిర్మల చరిత్రులు, ప్రకటతేజులు, లోకపాలనిభులు నగు నీప్రియభర్తలను నీవొక భంగిని వదలక యత్యంతంబు ప్రియంబులో నెబ్భంగి భజింతువు? నీయందు వారేవ్వరు నొక్కొడొక్కనికంటె ననురక్తులై యుందురు. ఇది యద్భుతంబు. ఎప్పాటునను నీదెస నీపతులకుఁ గిన్కయనునది లేదు. ఎప్పుడును నగు మొగంబుల నిన్ను వీక్షింతురు. ఇదేమేని వ్రతము పెంపా? మంత్రౌషధ వైభవంబా! సరస నైపథ్య కర్మ కౌశలమా! చతురవిభ్రమోల్లాసరేఖయా! ఏమితల్లీ! నీ విశేష సౌభాగ్య హేతవు నాకుఁ జెప్పవుగా!

నీవలన నిదియంతయు నిజముగా నెఱింగి నేనును శ్రీకృష్ణుని వశగతుని జేసికొని అత్యంత స్నేహాను భోగములచేఁ దలిర్పుచుందును."

అని సత్య యడుగఁగా మది నించుక కినుక వొడమగా సణంచుకొనుచు, నిర్వికారాకృతియై ద్రౌపది యిట్లనియె.

"దుష్టవనితలవలెనె నన్నును దలఁచుటకు నీకు మనస్సొప్పెఁగా! వాస్తవముగా నీవు పురుషోత్తమునకుఁ దగిన వనితవుగాఁదగవు." అని మేలంపు చందంబున నాపె వివేక హీనత నెఱుకపడఁ బలికి పాంచాలి వెండియు నిట్లనియె.

ఉ॥ "అలయక మంత్రతంత్రవివిధౌషధభంగులఁజేసి యెంతయున్
వలతురు నాథులంట మగువా! కడు బేలతనంబు కాన మున్
గలిగిన ప్రేమయుం బోలియుఁగాని యొకింతయుసిద్ధిఁబొంద ద
ప్పాలతులతోడి మన్కి యుహాపాత్తుగఁ జూచు విభుం డెఱింగినన్.

చ॥ మగువ యొనర్పవశ్యవిధి మందులు మాయలు నొందుశంకమై
మగనికిఁ దెచ్చు రోగములు, మానక మూకజడాది భావముల్,
తొంగి నొనరించునద్దురితముల్ తనచేసినచేతలై తుదిన్
జగమున కెక్కు నిందయును సద్గతిహానియు వచ్చు నింతికిన్.

క॥ కావునఁ బతులకు నెప్పుడుఁ
గావింపఁగఁ దగదు కపటకర్మంబులు త
ద్భావ మెఱిఁగి వర్తిని
యై వనితచరింప నదియె యగు నెల్లవిధమున్

పాండవులయెడ నెట్టిదాననై యిట్టిసౌభాగ్యంబు నందితినో యది నీ కెఱింగించెద. సావధానంబుగా వినుమది.

ఎప్పుడు నేని నేనహంకరింపను. మదప్రమాదములు లేక వారి చిత్త మేకముఖంబుగ భక్తి సేయుదు. కోర్కెయుఁ, జూపుఁ, బల్కులుఁ, జెయ్వులు వింతగాఁ జేయను. యక్షగంధర్వ సురల యందేని సత్పురుషుని దృణముగాఁ దలంతును. ఎన్నఁడుఁగాని పతులకుముందుగా స్నానభోజన శయనాదుల నాచరింపను. పతులకు నాసనపాద్యవిధులను బయలుఁబనపక నేనకావింతును. వారలకు మజ్జనభోజనాదిక్రియలును నేనయొనర్తును.

ధనధాన్యములు రిత్తగా వ్యయంబగుటకు నోర్వను. గృహస్థల భాండవిశోధనమ్ము లేమఱక సల్పుచుందు. బంధుజనులకు సంతతము ప్రమోదము కూర్తును.

పలుమాఱుఁ దలవాకిట మెలఁగుటగానీ, అసతీజనమైత్రత గానీ, కలహంబులకుఁ గారణములగు పలుకులు పలుకుటగానీ, నాకుఁ గానివేవి.

ప్రియులఁ బ్రవాసులై యుండునెడలఁ బుష్పాభరణగంధా దుల ధరియింపక తద్గతమతినై తదాగమంబు కాంక్షించుచుందు.

అత్తయెడ భక్తి గలిగి యాయమ యాజ్ఞ ననుసరించి చేటికావృత్తము లాచరించుచుందు. అతిథి జనులకుఁ బూజనా దులు స్వయముగాఁ జేయుదు. ప్రియంబు, మెత్తదనంబు, తాల్మి మొదలగు సుగుణంబుల నెన్నండు వీడ. పాండవులత్యంత మృదు స్వభావులని తేఁకువచెడి చరింపను. కోపంబడరినచో వారాశీవిష ముల వడువున క్రూరులని వెఱపుతోఁ గొల్చుచుందు.

మాయత్తయగు పృథాదేవికి స్నాన భోజనాదికము లందు సేవపరిచర్యచేసి యామెను బ్రీతి బొందించెద.

నిత్యంబు ధర్మరాజు బంతిని బసిండి పళ్లెరములయందుఁ బుణ్యులగు బ్రాహ్మణులు పదివేలు, యతులు పదివేలు భుజించు చుందురు. వారందఱకు నన్నపానంబులందు నేను సహాయ నగుచు ఉచిత వస్త్రాభరణాదుల సమర్పింతు.

ధర్మజుని నగరియందు మణిభూషణాలంకృతులైన పరి చారకులు నూఱువేలు గలరు. అభ్యాగతభోజనంబు లొడఁ గూర్చువారును నూఱువేలు గలరు. వీరెల్ల నిట్టిట్టి మెలఁకు వుల మెలంగుదురని తత్కృతాకృతంబులు నేన యెఱుంగుదు.

మఱియు నిరంతర మదధారాతరంగిత కపోలంబులైన భద్రగజ శతసహస్రంబులును, ప్రఖ్యాతజవసత్వ సంపన్నంబు లైన యుత్తమాశ్వశతసహస్రంబులును గలవు. వాని కన్నిం టికి నిత్యోచితంబులైన ఖాద్యంబు లొనరింపను, బరిపాలింపను దగినవారి నేన నియమింతు.

అఖండ భాండాగారపూరితంబులైన యగణ్యమణి కన
కాది సమస్త వస్తువులును, ప్రతిదిన విహితంబులైన యా
యవ్యయంబులు నా యెఱుంగని యవి లేవు. గోపాలజనంబులు
తుదిగాఁగల సకల భృత్యజనంబుల జీవితంబుల నరసి యేననదు
వుదు. యశోధనులగు పాండునందనులు నిజకుటుంబ భారంబు
సర్వంబును నాయందు సమర్పించి తాము నిర్భరులై యిష్టవిహా
రంబుల నుండుదురు. ఏ నెల్లవేళ నప్రమత్తనై ప్రవర్తింతు.

వేకువజామున మాత్రము వేడనిద్రఁ బొందుదు. అం
తియుగాని రాజ్యభారయుక్తంజేసి నా కాహారనిద్రలకే యెడ
ముండదు.

ఇట్టి వర్తనములతోఁ బాండవులకుఁ బ్రియము సేయు
చుందును. కాని నీవు చెప్పు మంత్రములుగాని ప్రమాణములుగాని,
యింద్రజాలములుగాని నాకుఁ దెలియవు”

అనవిని లజ్జాకలిత చిత్తయగు సత్య, ద్రౌపదికిట్లనియె.

“మానినీ! నేనెఱుఁగక యిట్లాడితిని. నాపలుకులను నగ
వుగఁగొని నానేరమి సైపవలయును. నీచరిత్ర మత్యంత సన్మా
నితము.”

పాంచాలిమందస్మితాననయగుచు “నదియట్లయగుఁగాక”
యని పలికి వెండియు నిట్లనియె.

ఊర్జితముగా ధర్మాన్వితముగా సుశీలంబుగా భర్త
మనస్సు నాచికొనునట్టి చతురోపాయంబు సెప్పెద వినుము.

చం॥ పతిగదవంగ దైవతము భామినికెందును లేదు స్త్రీలకుం డై
వతిగణించె నేని కలభాషిణి భానుగభూషణాంబరా
న్వితధనధాన్యగౌరవము, విశ్రుతసంతతియున్, సుశీలము స
ద్గతియును గల్గు, నొండుమెయిఁ గల్గునె యిన్ని తెఱంగులారయన్.

అత్యంతము శ్రమించినఁగాని యొక్కింతసుఖము ధర్మగతియు నెందుఁ గలుగదు. భర్తృశుశ్రూషావ సంతతసుఖంబు చేకూర్చు: ధర్మ మొదవఁజేయు.

కావున నిత్యంబు వెరవు, భక్తి, ప్రేమ ప్రియము గలిగి పతియెడఁ జరింపుము. మఱియు

మ॥ వనజాక్షుండు గడంగి నీవు గృహద్వారంబు చేరంగ వ
చ్చిన సంగా విని లెమ్ము సంభ్రమముతో.' హెచ్చాందునభ్యంతరం
బునకున్ వచ్చిన నాపనాదికరణంబుల్ దీర్పఁ బత్తృజనం
బు నిరోగించి తిరంచు నుండక ప్రియాంబుల్ సేయుచు మాపుంపగన్.

చ॥ తివిరి మురారి నీకు, గడుఁదీపుగఁ జెప్పిన పల్కులొగ్గినం
గువలయనేత్రి! నీమనసుగూడినవారికినైన నెగ్గఁజె
ప్పవలదు దానఁ నొండొక నెపంబు ఘటించు కలంగి లేని నీ
సవతులు కృష్ణబుద్ధివిరసంబగు నీదెస దుష్ప్రయుక్తిఁ జేస్.

చ॥ పతికినమంగులైన తగు బంధుమిత్రుల భోజనాది స
త్కృతముల నాదరించుచు నకృత్రిమభక్తి విశేషసంతత
స్థితమతివై చరింపుము తదీయహితేతర వృత్తులైన వా
రి తివ భవత్సుహృజ్జనము లైనను గైకొనకుండు మెప్పుడున్.

అదియుంగాక ప్రద్యుమ్నాది భవత్తనయులతో నైన నేకతంబున నేకాసనంబున నుంట దూష్యము. సతుల చరితలతి దుష్కరములుగదా! కులవతులు, సతులునగు మగువలతోఁ జెలిమియొనరింపు. ఇది నీకుఁ బరమసౌభాగ్యమూలంబైన యుపాయంబు."

నావుసు సంప్రీతచిత్తయై సత్య యిట్లనియె. "నీవు ధర్మజ్ఞవు. నీపతులు దేవసన్నిభులు. అత్యంత శౌర్యాన్వితులు నీపుత్రులు. ఏవిధమునను నీకు ధరణీరాజ్యము నేఁడి. వగవవలదు. ప్రతివింధ్యాదులైన నీపుత్రులందఱు యదుపురంబున సుఖంబున్నవారు, వారలకు నొక్కట కొఱంత లేదు. వారలదెస నిశ్చింతవు గమ్ము.

నీ మహనీయోపదేశంబు నా కెన్నటికేని విస్మరింపరానిది. ఆచరణమునందుఁ బెట్టవలయునది. నీ యుపకృతికి కృతజ్ఞురాల."

అని పలుకు నవసరంబునఁ గృష్ణుఁడు పాండవులవీడ్కొని మార్కండేయాది విప్రజనంబు నామంత్రణంబుచేసి గమనోన్ముఖుండయ్యె. సత్యభామయు యాజ్ఞసేనిం గౌఁగిలించుకొని సగౌరవంబుగా వీడ్కొనియె. అంత నాను దేవుండు ప్రియాసహితంబుగా రథారూఢుండై ద్వారవతీ పురంబునకరిగె.

# పదవ ప్రకరణము

సత్యాకృష్ణులు సనినయనంతరంబు పాండవులు కామ్యకవనంబు పరిత్యజించి, యనేకవనశైల నదనదీవిశేషంబు లాలోకించుచు ద్వైతవనంబునకుం జని, యందునబ్దముపై నెనిమిది నెలలుండిరి.

తద్వనంబున నొకనాఁడు ధర్మజుఁడు నిద్రించుచుండఁగా ద్వైతవనంబునఁ గల మృగజాతులు కలలోవచ్చి కన్నులనశ్రువారి దొరఁగఁ దమ్మొరలోఁగించి ధర్మజుతో నిట్లను.

"ధర్మాత్మ! మీ రనుదినము చంపఁగఁజంపఁగా అస్మత్కులంబులన్నీ వశిష్టములై నవి. మేము బీజమాత్రము చిక్కియిట్లుపనరుచున్న వారము. మీరింక నొండుకడకునరిగి మముఁ గావవలయును."

ధర్మజుఁడు "అట్లకాక!" యని వానికభయమిచ్చి మేల్కొని దానినంతయు ననుజులకెఱింగించి, మరల కామ్యకవనంబునకుంజని యందుఁ దృణబిందు నాశ్రమంబున సోదరాది సహితముగా సుఖముండె.

ఒక్కనాఁడు పాండవులేవురు తృణబిందు నాశ్రమంబున ధౌమ్యసహిత బుగాఁ బాంచాలినునిచి మృగయావినోదార్థంబు పలుదిక్కులకు నరిగిరి.

తదవసరంబున సింధుసౌవీరనాథుండగు సైంధవుండు చతుర్విధబల సంగతుఁడై సాల్వకన్యను బెండ్లియాడుటకు నిజవైభవ మెల్లనెల్లఁగాఁ జనుచుండి, యాశ్రమద్వార సమీపము

వండు ఆవనభూమియంతయు దేహకాంతిపటలంబున వెలుంగఁ జేయు ద్రౌపదినిజూచెను. అమ్మగువయందుఁదగిలిన చూడ్కు లనుమగుడఁ ద్రిప్పనేర్పులేక నిజసఖుండగు కోటికాస్యుజూచి యిట్లనియె.

“ఇమ్మగువ యెవ్వతియో! ఏ కతంబ యివ్వనంబున నిట్లున్న నిమిత్త మేమియో? ఈమె సురయక్షగంధర్వకన్యల నొకతెగానోపు. మహీతలమున మానవులకు నిట్టిచెల్వున్నదియే?

ఈయబల కెంజిగురాకు లీనునగ్రాలు గల కెంగేలు కదంబ శాఖ తుద గీల్కొల్పి, పాపకన్యల వోలె చిత్తమెత్తియింపఁ దొడంగెను. ఈ యబ్జాక్షి నా హృదయేశ్వరియైనచో త్రిలోక రాజ్యాధిపత్యము చేకూఱినట్లు పిలపిల్లుదు గదా!

వయస్యా! ఎట్లేని నీ కాంత నొడంబడఁజేసి, ననుఁ జరితార్థుని జేయఁ బ్రార్థించెద.”

కోటికాస్యుండును ప్రియునకుఁ బాంచాలి పాలికిం జని యమ్మగువ కిట్లనియె.

‘‘మృగనేత్ర! దారుణ మృగసంచార యోగ్యంబైన యివ్వనాంతరంబున నేకతంబ యిట్లుంటకు హేతువేమి! భవజ్జనకత్వమున నుద్వలితుండగు పురుషుం డేవంశమ్మునవాఁడు! నీ జీవితేశ్వరుండగు సుఖజీవితాత్ముడెవ్వఁడు? నీనాసుమై యింపు లొలుకు శబ్దమెయ్యది!

నాకెఱింగింపఁ దలఁచితేని వినుము. సురధుఁడను రాజపుత్రుండను; కోటికాస్యుడనువాఁడ ఆకాంచనరథముపై నున్నవాఁడు త్రిగర్తవిభుఁడు. నిన్నుఁజూచుచున్న యతని

ప్రక్కనున్నవాఁడు కళింగాధిపతి. ఆపద్మాకరము ప్రాంతమునుండి నిమ్నగను గానుచున్నవాఁడు ఇక్ష్వాకుకులోద్భవుండగు సుభగుఁడు. అదియట్లుండె.

సౌవీరకుమారులు పన్నిద్దఱుచేరి కొలువగా ననేక సహస్ర కరితురగరథపదాతి పరివృతుండై మహాగజంబుపై శోభిల్లుచున్న యవ్వీరుండు జయద్రథుండు. అమ్మహీపతి యిప్పుడు నీతెఱంగెఱుంగ నన్నునిటఁ బుత్తెంచె."

అనినఁ బాంచాలి ససంభ్రమంబునం గదంబశాఖ విడిచి, యుత్తరీయంబు నంగతంబు గావించుకొని, యతని కిట్లనియె.

"అన్న నేనిచట నొంటియున్నదాన. నీవిచటికి నేగుదెంచుట నీతియా? సుతవతిని ధర్మవతిని నగు నన్నితర కాంతఁగాఁ దలంచి పెక్కులు పల్కుచుంటివి. ఇది నీకుఁ దగునె? నీవు శిబి వంశోద్భవుండగు సురథపుత్రుండవగుట యెఱుంగుదు. అస్మత్ప్రకారంబు చెప్పెద. వినుము.

నేను ద్రుపదపుత్రికను. పాండవుల ధర్మపత్నిని. అవ్వీరు లిపుడు సన్నిధానంబున నునిచి నల్దిశలకు వేఁటవోయిరి. వారలింతకు వత్తురు. మీరమ్మహాత్ములకు మాననీయులరు, కావున వారు సేయు సత్కారంబులు గైకొని పోవుదురుగాక. ఒక్కింత తడవియ్యాశ్రమ సమీపంబున విశ్రమింపుఁడు" అని పలికి యుల్లన యవ్వరవర్ణిని * భయంబున బర్ణగృహంబు సొచ్చె.

* వరవర్ణిని: ఉష్ణకాలమున సుఖశీతలమును, శీతకాలమున సుఖోష్ణమును నైన యంగములు గలిగి భర్తయందనురాగముగల యుత్తమ స్త్రీ.

కోటికాస్యుండును గ్రమ్మఱఁజని సైంధవునితో నవ్వృత్తాంతంబు సెప్పె. అద్దురాత్ముండంత నమ్మగువ నపహరింపఁదలఁచి కతిపయజనసమేతంబుగా నరిగి పర్ణగృహంబు ప్రవేశించి యామె కిట్లనియె.

“వామాక్షీ! నీకు కుశలమే! నీమగలెవ్వరకు నెమ్మదియే”

ద్రౌపది యిట్లనియె “పాండవులకు సేమము. నీకు ననామయంబె? కురువర్యులయింటికి విందవైతివి. ఆసనక్రియా పాద్యములు గైకొని భోజనము చేయవేడెద. విభులు వేటవోయిరి. ఇపుడె వత్తురు. వారు వచ్చి నీకు వలయు సత్ప్రియములాచరింతురు”

సైంధవుండిట్లనియె. “అంబుజలోచనా! నీవు చేయు నతిథిసత్కృత్యములు లోకులకే యేని కొఱంత లేక వచ్చినవి. నన్నుఁ గృతార్థుని జేయుము. రమ్ము. నెమ్మితో రథమెక్కుము.

రాజ్యంబు స్వర్గంబుపాసి కాంతారస్థలవాసులై పరివారెల్లరు నవ్వఁగాఁ గుత్సితదశనుండుచున్న పాండవులం గొల్చిన సుఖంబు గనవే? ఎంత బేలవైతివి? శ్రీవిహీనులఁ గామినులర్థింతురా? నిఖిలసింధు సౌవీరభూవలయ రాజ్యగౌరవంబుతో నన్నుఁ జేకొనుము.

విని పాంచాలి ప్రకంపితచిత్తయై కొండొకతోలంగి వానియెడ నవమానదృష్టిఁ జూచుచుఁ, దనపతులరాకయ కోరుచుఁ బ్రతివాక్యంబులఁ గొంతకాలక్షేపంబు చేయుటకై వానికిట్లనియె.

“పాండవులకుఁ జెలియలగు దుస్సలకుఁ బతివగునీవు నాకుఁ దోఁబుట్టువవు. పాడితప్పిన పలుకులు పలుకనగునా? ధర్మాన్వయమున జనించితివి. ఉభయలోక విరుద్ధమగు పథమేల?

సైంధవుండు దరహసితాననుండగుచు నిట్లనియె. "నీ వెన్నడు రాజధర్మము వినియుండలేదా? రాజులకుఁ బ్రమదాజనమునెడ నాపి వేదుకంగ బసియేమి?

అనిన నయ్యంగన క్రోధకలుషితాంతరంగయై "యి ప్పాపాత్ముడు ప్రియవచనంబులఁ బోవఁడు, బెట్టిదంబులగాని చక్కఁ బడఁడు", అని తలంచి యతనికిట్లనియె.

"నృపాధమా! ధైర్యసారులు శభంగుర విక్రములుఁ బాండుయశస్కులునగు పాండుకుమారుల నాత్మలోఁదలఁపక నను ధిక్కరించెదవేల! నీకు గర్వ మింతతోఁబోగు. దుష్ప్రలాపములు దక్కుము. పాండవులాజిలో సమరాసురకోటికైనియు దుర్జయులు. వారికిఁ గీడునేసి పాతాళమునందు డాఁగినను మృత్యువు దప్పదు. తేలును గర్కటియును దెగు కాలంబునందుఁ జూలు దాల్చుగతి పాండవుల యిల్లాలినైన నాదెసకు దుశ్శీలుండవై తివి. ఇది నీ వినాశ చిహ్నము." అనిన సైంధవుండు నవ్వుచు నవ్వాలందికిట్లనియె.

"వెలఁదీ! పాండుకుమారవర్గము మాకు నింతియా! మాటలచే మమ్ముల నేల భీకులఁగీతి వెఱపింపఁ జూతువు? మఱి వినుము. సాహసికుల ప్రసూతులము. మాయందితర క్షితీశ సాధారణబుద్ధి చేయకుము. ఇఁక పలసని మాటలవలన బ్రయోజనంబు లేదు. వేగంబ యల్ల కనకరథంబు బొండె నల్ల మహాగజంబు నొండె నెక్కుము. బీరంపుమాట లాడక ప్రియవచనంబుల నస్మత్ప్రసాదభాజనంబ వగుము."

ఆ విన యాజ్ఞసేని వాని కిట్లనియె.

"వీరపత్నిని వీరసోదరినై కాలగతిచే ననాథవిధి నున్న దాన. ఎటుల లేనను నాకు నీకుం దెలుపనేల? పలుకు తియ్యమేల? అతులిత వృష్ణి కేకయ బలంబులతో శ్రీకృష్ణుండు, ఘోర గదను దాల్చి సమర కేళీలోలుండై భీముండు, గాండీవజ్యా వినాదమున దిక్కులు పిక్కటిల్లుచుండ నర్జునుండు, వచ్చినపుడు కన్నారంగం జూచి గాక నీ త్రుళ్ళ డగునా? ముత్తాపతివ్రతా సమహిమం జేసియే నన్నేక్షు నందరు."

అని పలికి యాధృష్టాత్ముండు తన్నుం బట్ట నసుకట్టుట యెఱింగి తను పురోహితుండగు ధౌమ్యుం బేర్కొని యాక్రోశించె. అత డతిరయంబునం బఱదెంచు నాసమయంబున సైంధవుండు పాపనిశ్చయుండై ద్రౌపదికొంగు నడుగిపట్టె. ద్రౌపది కోపముతో వాని నదల్చుకొని, త్రేయంగా వాండు భూమితలంబునం జిత్రంబుగం ద్రెళ్లె, జయద్రథుం డట్లు నేలం బడియుం దడయక లేచి, యామె నీడిగిచి, రథంబుపై నిడికొని నపరివారుండై యరుగం దొడంగె. అప్పు డప్పాలతి పురోహితునకు మ్రొక్కిన నమ్మహాత్ముండు సైంధవుం బేర్కొని యిట్లనియె.

"రాజకులమందుం బుట్టిన వారికి నేతాదృశ దుష్కృత్యము తగునా! సైంధవా! నాను పల్కు వినుము. ఈమె సాధ్వి. ఈమెను వేగ విడిచిపెట్టుము. పాండునందనులు నీ ప్రాణములు గొందురు. పోవిడువరు. ఈ పాపము నిన్ను ద్రెక్కొనక

విడువదు." అని యాక్రోశించుచు నమ్మహాసురవరుం డామె పిఱుందన చనియె.

ఇటఁ బాండునందను లనేక మృగంబుల వధియించి. యందఱు నొక్కయెడంగూడికొని యాశ్రమాభిముఖులై వచ్చునెడఁ బెక్కు అశుభనిమిత్తంబులుగాంచి మనంబు లాకులంబులుగా రథంబులు సత్వరంబుగాఁ దోలుకొనుచు యాశ్రమంబు సమీపించిరి. అటఁ బాంచాలి పరిచారిక ధాత్రిక యనునది యతికరుణంబుగా నేడ్చుచుండె. ధర్మతనయు సారథియైనయింద్రసేనుఁడు డిగ్గి నుఱికిచని "యిదేమి! నేలంబడి పొరలుచు నేడ్చుచున్నదానవు. నీకపకారంబు సేసినవారలెవ్వరు? అనియె.

ధాత్రిక వానింజూచి "సైంధవుచేతఁ బాంచాలి చెఱవోయె. దేవేంద్రప్రతిములైన యేవురుపతుల నాత్మఁగొనక వాఁడింత యకార్యముచేసె. వాస్తవముగా వానికిఁ జేటుమూడియే యిట్లు సేసె.

ఇంతకు మున్నె వాఁడు సనియె. వాఁడు మిక్కిల దవ్వరుగకుండగనే యత్యంతరయంబునఁ జనుఁడు. తోడ్తో శస్త్రము దొడుగుఁడు. వానిశస్త్రములఁ గట్టుఁడు. నెచ్చెలిని దెండు." అని పలుకుచున్న ధాత్రిక పలుకులువిని దాని నాశ్వాసించి యక్కురువీరులేవురు నాతనింబ సన్నద్ధులై క్రోధావేశంబునం జేసి మహోరగంబుల భంగి రోజుచు జయద్రథుఁడు వోయిన దిక్కుంబట్టి చనుదెంచుచుండిరి. సైంధవుఁ డెన్నడి. సైన్యము పిఱుంద నాక్రోశ విహ్వలుండై పోవుచున్న ధౌమ్యుంగని నమస్కరించి "మీరింక ఖేదంబుదక్కఁ డండు," అని పాండు

నందనులు సైంధవుసేనపయింగవిసి సింహానాదంబులు చేసిరి. పాండుపుత్రుల యరదంబుల సూచి సైంధవుండు ద్రౌపది కిట్లనియె.

"ఈ వచ్చువారెవరువుదు నీ మగలా? వీరిలో నెవ్వండే విధమువాఁడు ఎఱుంగవలయునను నభిలాషమైనడిగితి

పాంచాలి యనాదర క్రోధ ఘూర్ణితయగుచు, ఇంక వీరి నెఱింగినఁనేమి! ఎఱుఁగకుండిననేమి? దుర్మదమున దుష్కార్య మొనరించి నీచేటు నీవ తెచ్చుకొంటివి అయినను నన్నడిగితివి గాన, జెప్పెద, వినుము. ఇంతియగాక నీవలననాకు భయమిసు మంతయు గలుగదు. సోదర సహితుండగు ధర్మనందను గంటి. ఇంకనాకుఁ గుశలంబ.

మ॥ "తనువృత్తాంగుఁడు శుద్ధకాంచనసమాత్యుద్వర్ణుఁడుత్ఫుల్ల స
ద్వనజాతాయతచారులోచనుఁడు దీర్ఘోద్భారి తేజోఘనుం
డనఘుం డల్లరథంబుపై వెలుఁగుపుణ్యాత్ముండు ధర్మాత్మజుం
డనిరోధప్రతిభాప్రభావనిధి యత్యైశ్వర్యశౌర్యుండనిన్.

చం॥ ఘనజవసత్వ చారుతురగంబులఁ బూన్చినయల్ల విస్ఫుర
త్కనకరథంబుపై నుదితకాయుఁడు సాలమహీరుహంబు చా
ర్పునఁ దనరారుచున్ వెలయుఁభూకుటియున్ దశనోష్ఠపీడనం
బును నయియున్నవాఁడనిలపుత్రుండు భీముఁడు భీమఁడాజులన్.

ఉ॥ ధర్మజుకూర్మితమ్ముఁడును ద్రోణుశిష్యుఁడు సైనవాఁడు స
త్కర్ముఁడువాఁడె చూడుము ప్రగాఢవికీర్ణ జితేంద్రియుండు దు
ష్కర్ములఁగన్నపైవఁడు నికామభయంకర విక్రమక్రియా
నిర్మథితారి ఘణమఁడు నిర్మలతేజుఁ డజేయుఁడెంతయున్.

చ. ఆయనయసంగ్రహుండు వినయవ్యవసాయ ధరార్థలోకసం
శ్రయుఁ డుగ్రకృతాస్త్రుఁ డాహవవిశారదశౌర్యుఁడు శిష్టబాంధవ
ప్రియుఁడ సమానసుందరగభీరశుభాకృతి యల్ల పుణ్యుఁడా
రయ నకులుండు పాండుసుతరత్నము భానురకీర్తి యిమ్మహిన్

ఉ॥ వీఁడు చిత్రయోధిదృఢవేది కృతాస్త్రుఁడు భూరిబుద్ధివి
స్ఫారుఁడు వాగ్విశారదుఁడు శార్దూలశూరిమితవ్యుఁ డుజ్జ్వలా
కారుఁడు ధర్మధర్ముఁ డపకారుఁడు ప్రౌఢతరంగ తేజుఁడ
ధీరుఁడు పాండవుండు సహదేవుఁడు పుణ్యనిధుండు పెంపునన్.

వీరేవురు నత్యంత శూర్వారులు. వీఁ బారిఁబడిన నీ సైన్యంబు సకలంబు వికలంబగు. నీవును ప్రాణంబొండె మానంబొండెఁ గోల్పోవక మున్నె యిం బోనేర్చెదవే! ఇప్పుడే బుద్ధిగలిగి ధర్మజు నాశ్రయింపుము. ఎట్టి శత్రువులైన శరణముసొచ్చిన వారి నతండు కరుణతో రక్షించును.”

అని చెప్ప నవసరంబునఁ గౌంతేయులు సైంధవసేనం దలపడి దుర్ముఖంబులనెల్ల జీకట్లుగలియునట్లు బాణపటలంబులు పఱపింపఁదొడంగిరి. సైంధవుండును నిజయోధులఁ బురికొల్పుచు నాహవభూమి నిలిచె.

ఇట్లు త్రిగర్తసింధుసైన్యంబులతో ననేకనరపతి పరివృతుండై నిలిచిన సైంధవుం జూచి, భీమసేనుండు క్రోధారుణలోచనుండై గదాదండంబు త్రిప్పుచు వానిపయింగవిసె. అడ్డపడినవారినెల్ల, బొదుపుచు రథికులను మదగజములను బదాతులను దురగములను దుర్వారగతిఁ జదుపుచుండె. అధర్మజనకుల సహదేవులును వైరసేనఁ దెగటార్చుచుండిరి. గాండీవజ్యాని

నాదము మిన్నుముట్ట నర్జునుండు శైబ్యులను నిక్ష్వాకులను సైంధవులను ద్రిగర్తులను దునిమి తూటాడె.

అపుడు గిరిభూమియంతయు శవమయమయ్యె. అంబరంబంతయుఁ గబంధమయమయ్యె.

అట్టి ద్రంకుల జయద్రథుండు ద్రౌపదిని విడిగడచి రథంబు దోలుకొని పఱచె. ధర్మరాజును, ధౌమ్య సమన్వితయై యున్న పాంచాలింగని నిజరథంబుపై నిడికొనియె. అపుడు భీమసేనుండు ధర్మరాజునకిట్లనియె "ద్రుపదసుతను దోడ్కొని నీవు ధౌమ్యుఁడు గవలు ఆశ్రమంబుకుఁజనునది. నేను నర్జునుఁడు సైంధవుని వెన్నాడి మట్టి సహాతుఁ జేసెదము."

అని ధర్మరాజుయుండు "చెలియలగు దుస్సలను దలంచి వానినొక సజీవునిఁజేసి పోనిండు" అన ద్రౌపది భీమార్జునులతోడ "నప్పాపాత్మునిపైఁ గృపఁ జేయవలవదు. అవశ్యంబు వానివధియించి నాకుఁ బ్రియంబుగావించునది. ఇట్టి ద్రోహి యెల్లభంగుల వధ్యుండు." అనియె.

తదనంతరంబ ధర్మనందనుండు ధౌమ్య ద్రౌపదీ నకుల సహదేవ సహితుండై యాశ్రమంబునకుఁజనియె. భీమవిజయులు రథంబులు రయంబునఁదోలుకొని, చని, క్రోశమాత్రాంతరంబున సైంధవునిగనిరి. కిరీటి దూరాపాతవిశిఖంబుల జయద్రథురథ్యంబులఁబడనేసె.

అపుడు సైంధవుఁడదరిపడి యరదముడిగి మేనెల్లఁ జమర్ప, నూర్పులు పెల్లుగాఁగఁ బఱచుచుండె. వానిఁజూచి నగుచు భీమార్జునలుడాసిరి. భీముఁడతిక్రోధంబున వానినొడిసి

తలంబట్టి నేలఁబడ దిగిచె. ఒడలెల్ల బిండిపిండంగఁ బొడిచె. అర్జునుండు చూచి, "యింతచాలు. ఇంక నొడిచినఁ బ్రాణవిముక్తుండగు. అజాతశత్రువచనంబులు దలంచి వీనిఁ గరుణింపు" మనియె.

భీముండపుడు వానికత్తి యొత్తి పగతుశిరము చెక్కులెగయఁ గొరిగి, పెడకేలుకట్టి రథంబుపై నిడికొనియె. భీమార్జునులంత నిజాశ్రమంబునకుం జని ధర్మపుత్రునకు నివేదించి "వీఁడె పాండవదాసుండ" నిరి. "అల్లునివీఁడు వధ్యుండుగాఁడు. విడిపింపుఁడ" ని ధర్మజుండనియె.

పాంచాలియు జయద్రథుం జూచి నవ్వుచు "ఇప్పాపాత్ముండు భవదీయ దాసుం డయ్యెఁ గావునఁ బోవిడువుండు" అని వానివిడిపించె. సైంధవుండు పాండవులకు మ్రొక్కి లజ్జావనతవదనుండగుచు నాచోటు వాసిపోయె.

# పదునొకండవ ప్రకరణము

పాండవులు వనవాసంబు సముచితంబుగా సలిపిరి. పండ్రెండవయేటి కడపట వారికి ధర్మదేవతా సమాగంబయ్యె. తత్ప్రసాదంబున నజ్ఞాతవాసంబునకు భంగంబుగాకుండ వరంబు వడసిరి. అంతకుమున్న తమ వెనుక నడవులం దిరుగుచు నగ్నిహోత్రంబుం దోడకొని వర్తిల్లు భూసురోత్తముల సగౌరవంబుగ వీడ్కొని, బాహ్యాంతరవారంబును సముచితరీతి వీడ్కొల్పి, ద్రౌపదీ పాండవు లతిరహస్యవృత్తి నజ్ఞాతవాస విధానంబును నిర్ణయించుకొనుచుండిరి.

కంకుండను నామంబుతో సన్యాసిగా ధర్మజుండును, వలలుండను పేరితో వంటవాఁడుగా భీముండును, బృహన్నల యను పేరితో నూర్వశీ శాప మనుభవించుచు, నుత్తమ కన్యాజనంబులకు నృత్యము గఱపువాఁడుగ నర్జునుండును, దామగ్రంథియను నామముతో నశ్వశిక్షకుఁడుగ నకులుండును, తంత్రీపాలుండను పేరితో గోష్ఠంబున కధిష్ఠాతగా సహదేవుండును, మత్స్యదేశంబున విరాటురాజునొద్ద నుండ నిశ్చయించుకొనిరి.

ధర్మజుఁడు పాంచాలి నాలోకించి ఖిన్నాంతఃకరణుండగుచు

చ॥ ఇది ముద్దరాలు పను లేమియుఁ జేయఁగనేర దింతయున్,
మృదు వొకకీడుపాటునకు వేగొనఁజాలదు దాత్తచిత్త యొం
టిదిరుగుడానికోర్వ దొకటీదకుఁ దాసవరించుచొప్పెఱుం
గదు తగనొల్లనుంగొలువగా వెరవెబ్బుయిఁ గల్గునక్కటా!

అనియె. అతని చిత్తంబున వెనుకబాటంతయు మానునట్లుగా ద్రౌపది యిట్లనియె. 'సైరంధ్రీవేషంబున నంతఃపురము చెంతకుఁ బోయెద. పట్టపు దేవిపిలువనంపును. పోయి యంతఃపురమునఁ గొలువు చేసికొనుచు సులీమన వృత్తంబున పొంతపోవక మాలిని యను పేరితో జరిపుచుందు. కలపంబులు తనువున నలదుట, మృగమదంబునఁ దిలకంబు రచియించుట, పువ్వుల ననేక ప్రకారంబులఁ గట్టి ముడికొక్కరీతి నెత్తులు గట్టి యిచ్చుట మొదలగు కార్యములఁ జేయుచు వివిధ శిల్పములఁ బ్రవీణనై మత్స్యరాజమహిషి మనస్సున కెక్కు-నట్లు ప్రవర్తించుచుందు. మీరెచ్చటనుంటిరని వారు ప్రశ్నించినచోఁ బాంచాలికడనుంటినని చెప్పెద."

ధర్మాత్మజుఁడు ద్రౌపది కిట్లనియె. "మన వంశంబును వృత్తంబును, పెంపును రక్షింప నోపునట్టి మహాసాధ్వివి. ఉచిత తులువల తలపులు గనుఁగొని యేమఱక మెలఁగుచుండుము."

యాజ్ఞసేని యనాదరమందస్మిత సుందరవదనారవింద యగుచు నిట్లనియె. "ఎందును గౌరవభావం బెడఁగనీక పాతివ్రత్యాచారముతో సైరంధ్రీజాతికి దగు చరియింతును. కావున నేను మితభాషావిరచనము, వ్రతసంభాషణము, పాపభయము యుచితరీతినుందు."

ఈవిధంబునఁ గార్యంబు నిశ్చయించుకొని యగ్నిహోత్ర్యుని యొద్ద నునిచి హుతవహునకుఁ బురోహితుఁ జేసి, పాండవులు పాంచాలిఁ బురస్కరించుకొన బడిపోవుచు విరాటునగరంబు గడిచేరిరి.

అందుండి యూళ్ళు సాగక అడవి తెరువుల నడచి విరాటు నగరంబున కనతి దూరంబగుకాంతారంబునం దతిమిపోవు సమయంబునం బధి శ్రమంబు నూని యాజ్ఞసేని యిట్లనియె. "దప్పి పుట్టుచున్నది. వేళ్ళు పొక్కిపోవుచున్నవి. గోళ్లలో నెత్తురులు చిప్పిలుచున్నవి. నాకుం జిత్తంబు వశంబుగాక యున్నది. ఆవుర మిచ్చటచ్చట యను నాశల నచ్చితిని. ఎంత దవ్వు గలదో! ఇప్పటి నాభంగిచూడ నొకయడుగైన వేయఁజాల."

అప్పుడు ధర్మజుఁడు తనమనమునం గరుణయు, ఖేదంబును బెనగొనుచు నుండగా నాతని యనుమతిని సవ్యసాచి యక్కోమలి నెత్తికొని పురము చేరవచ్చె.

అట పాండవులు తమ తమ యాయుధంబులు ప్రేత భూమి పరిసరారణ్యము నందుం గల యొక మహాశమీ వృక్షంబు నందునిడి మహోరగంబులం బెట్టి బంధించు తెఱంగున వాని గట్టివేసిరి.

తదనంతరము వారచ్చోటు వాసి పురాభిముఖులై చనుచుండిరి. అజ్ఞాతవాస కాలంబునం దమ రహస్య వ్యవహారంబునకు ననువుగా నేవురు పేళ్ళను గ్రమముగ జయ, జయంత, విజయ, జయత్సేన, జయద్బలు లని సంకేతించి కొనిరి. ధర్మదేవతానుగ్రహముచే దోడ్తో నున్న యుక్తినివారి వారికిఁ దగినట్లు వేషంబు లేర్పడ సంతసించుచు విరాట్రాజును జేరి యాతని యనుగ్రహపాత్రులై యుండిరి.

ఇట్లీవుగ చనిన పిదప సముచితభంగి సైరంధ్రీ వేషముతో నించుక వలవలి దిక్కునకుఁ గురులు దుఱిమి, పరిచారి

కాల్వశేఖావగింతి తన తనువున నచ్చువడగా, ద్రుపద కన్యక పురము సొచ్చెను.

పౌరజనంబులు రాజవీధి నవ్వేలందీ జూచి, "ఏ జగంబునం గాని యిట్టి సతీజన మున్నదా! ఈలతాంగి మొయిలు కప్పిన యమృతాంశుకళ." అనుచు నంతంతం జేరి, "నీవెవ్వరవు. ఏమి పనికై యెచటికి బోవుచుంటివి?" అనిరి.

ద్రౌపది యిట్లు చెప్పె. "నేను గట్టువాలుదానను. కడుపు కూడుపెట్టి, కట్టం జీరయిచ్చి నను నెవరేలుదురో యట్టి వారికిం బనులుచేసి మెలంగ బుద్ధిం దలచితి."

అనవుడు జనులు విని సందియంబు సచ్చెరువు నలరు మదితో "ఇచ్చెలువ కడుపు కూటికి నెచ్చోటనేని పలుచు నేట. ఇది పల్కు గుణంబులు!" అనుచుం గనుంగొనుచు ముసురుకొని చనుచుండిరి.

పాంచాలరాజనందన రాజమందిరంబు చక్కటికి నేగె.

ఆ సమయంబున విరాటుని దేవి సుధేష్ణ రమ్యహర్మ్యాగ్రమున తుదిని బ్రణయసఖీజనంబుతో విహారము చేయుచు ద్రౌపదిం జూచి కుతూహలంబున "ఇదిగో యొక రమణీయ కాంతామణి. ఎక్కడనుండి యెక్కడికిం బోవుచున్నదో నీచభామినులరీతి వినీతయై పల్కుచున్నది. పౌరులును వెక్కసమంది చూచుచున్నారు. వేగము దీని దోడ్కొనిరండు." అని ప్రౌఢాంగనల ననిపె. ద్రౌపదియుం దనకు దలపు నెరవేరెనని కేకయసుతాపరిచారికల వెంబడిచనియె.

విరటుమహిషియు, మొగంబున గౌరవంబును, గేలఁ బురశ్రప్రసారమును, దనువున నమ్రభావమును గదల్కొన భూరితరాదరముతో "ఇందురమ్మ" అనుచుఁ దద్రూప మాపాదమస్తకము వీక్షించుచు నిట్లనియె.

"నీకులమేమి? నామమేమి? ఎవ్వరిదానవు? ఏమిపనిబూని ఎచటికేగుచుంటివి? మాకెఱుఁగఁజెప్పుము." యాజ్ఞసేని యట్లనియె.

నేను సైరంధ్రీజాతిసంజాతను. నాయభిధానంబుమాలిని. పురుషపంచకసనాథనైయుంటియు ఒక్కకారణంబున విరోధుల చేతఁ బతులసన్నిధిని దలపట్టి యీడ్వంబడితి. వనంబున కరిగి ఫలాహారంబులం గాలంబు గడిపితి. ఇటమీఁద నియమాచరణంబునకు నొక్క వత్సరంబు గొంతిగలదు. నీవు ధర్మవర్తినివని విని నానేర్చు పనులవేఁట నీకడ నిలువఁ దలంచి యిందువచ్చితి."

నాపుడు సుధేష్ణ యిట్లనియె. "సుర గరుడ యక్ష సిద్ధ తరుణులలో నీవొక్కతె వగుదువు. ఇప్పటికిఁ జనుదెంచిన కారణమును బొంకక చెప్పుము."

అన దరహాసము తనమోమునకుఁ దోడవుగా ద్రౌపది యిట్లనియె. "ప్రథమమున శ్రీకృష్ణదేవియగు సత్యభామకుఁ బనులుచేసితి. పిదపఁ బాంచాలికతఁ బరిచారకావృత్తి వర్తించితి. ఆదేవి నాకుఁ బ్రాణంబు ప్రాణమై రక్షించుచుండెడిది. నీవును నీచపుఁబనులకు నాచాలమియొఱిఁగి, మన్ననకుఁ బాత్రముగాఁగైకొని, యాచారము తప్పకుండ నన్ను రక్షింపుము.

నేను గంధములు కూర్పఁగలను. తిలకంబులు దిద్దఁగలను, పువ్వులు దండగ్రుచ్చి తల ముడువఁగలను."

కేకయ రాజనందన, యత్యాశ్చర్యముతో నిట్లనియె. "నీరూపము చూచి మారాజువిభ్రాంతుడను. నిన్నెమ్మయి నేను బలిగొందు? ఇంతులే నీపైఁజూడ్కి నెక్కొల్పి విస్మయమంది చూచుచున్నారు. ఇక బురుషులసంగతి వేఱ చెప్పనేల! ఇట్టి నిన్నుఁగైకొని నాకై నేను విధ్వంసదశ తెచ్చుకొనుట వెరవై యుండునా!"

పాండవ ధర్మపత్ని యిట్లనియె. "నీ తలంచినట్లుకాదు. నాపతులు గంధర్వులు. లావు విక్రమము గలవారలు. నన్నెప్పుడు నేమఱరు. నీచమతి నన్నెవ్వఁడు చూచునో వానినారాత్రిలోఁ దెగఁజూతురు కావున బురుషులు నాదెసం దేఱిచూడ వెఱతురు.

అదియుంగాక నాచిత్తము తాదృశులకు గోచరము కాదు. అతినీచవచనములు నాకడఁ జెప్పకుము తల్లీ!

ఇంక నెమ్మనమున నూరడిల్లుము. అనుమానము మానుము. నన్నేలుకొనుము. భయభక్తులతో నుదాత్త నాగరక భంగుల నీమది కెక్కునట్లు మెలంగెద. సాధువృద్ధులు మెచ్చునట్లు వర్తనము సల్పెద.

నను నీచకార్యములకుఁ బనుపక, యెంగిలి లోనగువానికి లోనుపఱపక తగు మన్ననతో నరయువారలకు నస్మత్పతు లుపకృతులు చేయుదురు."

అనిన సుధేష్ణ సంతసిల్లి ద్రౌపది నాదరించి యునిచి కొనియె. యాజ్ఞ సేనియునంతిపుర ... చరితకలవడ మెలఁగుచుండె.

ఇవ్విధముగఁ బాండవులేవురు నవ్వేలదియు విరటు పుర మునందు సకలజనుల కజ్ఞాతముగా నివసించుచుండిరి.

ఇట్లుపాండవులు పాంచాలీసహితంబుగా విరాటునగరం బున వర్తించుచుఁ గతిపయదినంబులు గొంతతడుకాలంబు గడపిరి. అట్టియెడ మత్స్యావతిమఱందియు దండనాథుండును, కీచకాగ్రజుండును. రూపాభిమానియు దుర్విదగ్ధుండును. నగు సింహబలుండు తనయప్పసుధేష్ణకు మ్రొక్కఁజనుదెంచె.

అద్దేవికసతి దూరంబుననున్న ద్రుపదరాజ నందనం గనుంగొని ఆమెపై నెక్కొనినచూడ్కిని గ్రమ్మఱుప నేరక బెగడొందుచుండె.

అయ్యెడ "ననువీఁడుచూచెఁగదా" అనుచితకృత్యంబు లాచరించునేమో "ఇచటనాకుదిక్కెవ్వరు!" అనుభయమున మేనఁ గంపంబు పుట్టఁగాఁజేయుటకునేమియు నుపాయంబు గానక పాంచాలి డిగులొందుచుండెను.

అంత కీచకుం డక్కోమలి కలరూపు నిజసహోదరివలన దెలియందలంచి పాంచాలిఁజూపి వేగపడుచు "ఈమెకులమేమి! చరిత్రమేమి! నాథుఁడెవ్వఁడు! ఇచటనేమిపని జేయుచుండును! అనియడిగె. సుధేష్ణయు అతని చిత్తవృత్తి మఱలుప నతనిపలు కులుగిటునఱుచ్చి యొండుపలుకులుపలికె. కీచకుండు ద్రౌపది యున్నయెడకుంజని,

"నీ వెవ్వరితనయవు! నీపతి యెవ్వఁడు? అనఁగా నప్పాంచాలి యవ్వలుకులు విషమిగా భావించి నిర్వికారయై యూరకుండె. అచ్చపలుఁ డింక, దడయంజాలక తనయభిలాషంబు తెలుప ద్రౌపదిమిగులఁ గలుషించి పరిభవ వికారంబుతో నపుండ దన్నుఁదాన యుపశమించుకొని "వీఁడు కుర భిమాని" వేగిరి పాటుకూడదు నేరుపుతో దన తప్పించుకొనవలయు" ననితలంచి యిట్లనియె.

"అన్నా! నా యున్న భావము దెలుపవేమి? ఈ యొడలు, ఈ చీరలు ఏవపుట్టించు చున్నవి గదా? నీవును నాఁడుబుట్టువు తోడఁ బుట్టినాఁడవు గదా? ఇట్టి మాటలాడఁ జనునే? అదియుఁగాక నేనుహీనవంశ జాతనయ్యుఁ బతివ్రతను".

అట్లు వీడఁగఁ బల్కుటయుఁ బ్రయోజనంబు గానక "యితండు నీచుండు గావున జంకించినంగాని మొత్త బడిపోవఁడ"ని తలఁచి యిట్లనియె.

శా॥ "దుర్వారోద్యత బాహువిక్రమ రసాస్తోక ప్రతాప స్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవురిప్డు నినుదోర్లీలన్ వెసన్ గిట్టి గం
ధర్వుల్ మానసుప్రాణముల గొనుట తథ్యంబె బొమ్మయింక గీచకా.

కీచకుం డిట్లనియె. "నా మహాభావానుబలము, జెనయఁగ ముజ్జగములందు నెవ్వాడును లేఁడు. ఇది నిక్కువంబు." సైరంధ్రి సైరణదక్కి ధిక్కరించి యిట్లనియె.

అంతని మానివండ్లఁ గోయఁదలఁచుట వెఱ్ఱి. మునుఁ జెడిన రావణాదుల నెఱుఁగవా ? "

కీచకుండు కొంచెము చిన్న బుచ్చుకొనిఁ చేయునది లేక యప్ప యొద్దకు వెళ్లి - “అప్పుడు నీకుం జూపిన యన్యాయ నామధేయంబు లడిగిన యప్పొలఁతి యిప్పుడెందుఁ బోయెనో” యని యడిగె.

సుధేష్ణయు నతని వేగిరపాటు చూచి శిరఃకంపంబు చేయుచు, ఏమియపాయంబు మూడునో” యని నయంబున భయంబున నేకవిధంబుల బుద్ధులుగఱపి ప్రయోజనంబు గానక యతని యవస్థం జూచి విచారించి, యెట్టకేలకు నిట్లనియె.

“ఇంత దొందరయేల! ఆసుదతిని నీ నివాసమునకు దినము లోపల నాసవమునకని యవశ్యము పంపుదును.

ఆమాట వినికీచకుండు ముదితహృదయుండై నిజసదనంబునకుం జనియె. సుధేష్ణ పాంచాలిని రావించి తృష్ణభావించుచు నిట్లనియె. “అతిశయించు తృషపెల్లి దప్పుచున్న నావదనము వడలుపట్టె. మదిరారసమానంగ, నామది వేడ్క జనియించు చున్నది. కీచకునియింట వాచవియగు బహువిధంబులఁ వారుణి యెప్పుడుఁ దీయకయుండదు. నీగమనవేగము చూతముగాక! అచటికిఁజని వారుణి వేగ కొనిరమ్ము.”

అనవుడు నుల్లము తల్లడిల్లఁగా, దనువు ఘర్మజలంబు దాల్చుచుండఁగా “నచటికిఁ బోవుటయెట్లు? పోనొల్ల ననుట యెట్లు? దైవమా! నేర్పుతో నీయిక్కట్టు పాపికొను దీమస మెట్టిది?” అని తలంచుచు డోలాందోళితమానస యగుచు సుధేష్ణకిట్లనియె. “తల్లీ! ఈపనికి నన్నుడిగి యితరులఁబనుపుము.

నీగృహ మతి నిర్మలచరిత భరిత మగు సత్పతుల యసన్నిధి నైనను మతి నూరడిల్లి యుంటి. నేఁడు నాపై మన్నన తప్పుట పాడియా!

ఎవ్వారి యింటికో, యెద్దియో తీసికొని వచ్చుటకు నన్నుఁ బంపఁదగునె? నాఁడు నిన్నుఁ గొల్వనే తెంచినపుడు నీచపు బనులకు నేను జాలకునికి చెప్పి యనుజ్ఞ తీసికొనలేదా!

సుధేష్ణయుఁ దాఁజేయు ననుచితంబునకు మిగుల శంకించి యును దమ్ముని వలవంత దలఁచి పాంచాలితో సాదరముగా నిట్లనె. "సఖీ! వేడ్కపడి ఆసవము తీసికొని వచ్చుటకు నొక నికృష్టను బంపలేక నీకుఁ జెప్పితి. దీని నీవు గోసెక్కఁజేసి, నన్ను హీనవిధానమునందు నియోగించితి ననియుమ్మలించితివి. ఇది నెయ్యము తియ్యము కల్మియే?

అది లాఁతి యిల్లా! నిను నెఱుఁగని వారెవరు?"

అని మఱియుఁ బెక్కుభంగులఁ బ్రార్థించె. పాంచాలియు నింకఁ బెనంగినను బ్రయోజనము లేదని తలంచి "నీవు గోరినట్టి పనిఁ జేయుదును." అని కాంచనచషకంబు పుచ్చుకొని యార్తమూర్తియై చనుచు,

చం॥ అలమటఁబొందు కాలవిధి పోయని దైవముఁజూడు నిత్తఱిం,
గలరొక నాకుదిక్కనుచు, మొగంబున నశ్రులువెల్లి గొల్పఁ దొ
ట్రిలఁబడు జల్లనంజెదరు డెందము గూడఁగఁదెచ్చి నన్ను గే
వలమును బుట్టె నెవ్వరికివచ్చునకుం గలగున్ వెనుంబడున్.

ఇవ్విధంబున ద్రౌపది దురవస్థం బొందుచు "మహాపదలకు బరిహారణంబు హరిస్మరణం" బని తనహృదయ పుండరీకంబున బుండరీకాక్షు నిక్షేపించుకొనియె.

శిరమ్ముపై కెత్తి వెలుంగు వేవెలుఁగుఁగని "పాండుపుత్రులయెడఁ దప్పనిమనస్సు గలదాననేని, నో ప్రభూ! కీచకుని వలన నన్నొకకీడునుఁ బొందకుండ రక్షింపుము" అనుచుఁ గేలు మొగిచె.

తరణియు నత్తరుణిఁగాచుటకు భుజావిస్ఫురణాఢ్యుఁడగు నొక్క రక్కసుని బనిచె. వాఁడును బనిపూని రయంబున నదృశ్యాకారుఁడై వచ్చినిలిచె.

ద్రౌపది కీచకుని మందిరంబు చేరనరిగి బెబ్బులియున్న పొదలుచొచ్చు లేడిచందంబున నందుఁ బ్రవేశించె.

కీచకుండును ద్రౌపది వచ్చు తెరవారయుచు హర్ష సంభ్రమంబులు పెనఁగొనఁగాఁ జంచలభావపరీతమూర్తియయ్యె. ద్రౌపది తత్ప్రదేశంబునకుంజని "తృషపుట్టఁగా దేవవారుణి తేరఁబనుపఁగా నరుగుదెంచితి." అనుచుండ నింతినెమ్మొగము నందు నతఁడు దృష్టులు నిల్పి "దేవితృషతీర్పఁ బూనితివి. మంచిది. ఆపె సహోదరుండనగు నాతృషయు నీసంభావనమెయి దీర్పకుంట పాడియా" అనియె. ద్రౌపది యప్పలుకులు పెడ చెవులఁబెట్టి ధీరురాలుగాన నిర్వికారయగుచు "వేగంబ మదిర పోయింపుఁడు. అద్దేవి యెదురుచూచుచుండు. తడవైనచో నాపై నలుగును. అనఁ గీచకుండు "సుధేష్ణపాలికిమదిరను నితరులచేఁ బంపెదఁగాక! గజతురగ సమితిఁ బొంపిరివోయెడు

నాదురాజ్యలక్ష్మికెల్ల నీవ పాలిక గాలవుగానుండుము." అని యంతకంత కగ్గలించుతమకమునఁజేసి ఆమెఁబట్టుకొనియె. తన్ను రక్షించుచు వెన్నంటి వచ్చుచున్న దనుజారి మహాబలము తన తనువొందఁగా నాతని విదిల్చి రథనముతో నా మందిరము వెడలెను.

ఇట్లు ద్రోచికొనిపోవుచుండఁ గీచకుండు వెనువెంటఁ దగిలె. అమ్మగువయు మరలిచూచి, భయభ్రాంతయై యెవ్వ లనికింబోదునోయని తలఁచి, దైవయోగంబున విరాటుండు బయలు కొలువున నునికిం జేసి యచ్చటికి బరుగిడియె. అతఁడు గర్వోన్మత్తుండు. కావున జనసమూహంబును సరకుసేయక సమదగజగమను జంగమలతకై వెనుకొనుభంగి సరభసంబునఁ జని కోపంబుతో నమ్మహాసాధ్వి వాలుజట్టు తిగిచి కూలనేసె.

అట్టియెడఁ బాంచాలీ రక్షకుండగు రాక్షసుండు ఆతని డొల్లద్రోసె. ద్రెళ్ళుపడి కీచకుండును నోరువుదప్పిన మహానాగంబు కరణి నిట్టూర్పు విడుచు నిట్టట్లు బడుచు నేలంబున దొల్లడి కొను చుండె.

ఆసమయంబున నుద్యానస్థానంబునను డిగి పవన తనయుఁడు ప్రాణేశ్వరి యవమానమును, సింహబలుని విజృంభణమును, జూచి కోపవేగమునఁ గన్నుల నిప్పులు రాలుచుండ నతిభయంకరాకారముతో నచ్చెరువందఁ యున్నతవృక్షంబు నిరీక్షించి ధర్మతనయుం గనుంగొనియె. అంతం దతని యాకారంబునూహించి, సమయంబుల వాదించి, "మన వలలుండీ వృక్షము నెక్కడఁ జూచెను. మఱెచ్చట నసేవ్యత్మోజములు కేగా!

పరశాఖలచే నొప్పుచు, సుపాశ్రితవ్రతతికి నత్యంతప్రీతి సంధిల్లఁ జేయు నీవృక్షంబును చుట్టకట్టియలకై ఖండింప నేటికి” అని నిగూఢభాషణంబుల నతని కోపగసంబు దెలిచె.

ద్రౌపదియు నాయిద్దమ్ముల చేష్టితములు సూచుచు దైన్యం బాకృతిఁ గొన్న చందంబున విరాటుని సభఁ జేరనరిగి, పంచిన కోపమును, సముయభంగి భయంబును మనస్సునఁ బెనఁగొనుచుండ, భర్తలను దక్కిన సభ్యులఁ జూచురీతి రూక్షముగా వీక్షించుచు, మత్స్యనాథుడు వినుచుండ నెలుఁగు చలించుచుండ నిట్లనియె.

“నన్నొక నీచుఁ డిట్లపమానము చేయుచుండఁగా నన్నేఁటను మహాసమర్థులగు నాగంధర్వభర్తలేవురు మిన్నక చూచుచుంట నచ్చెరువు గదా! ఇంక భూమిలో నెవ్వారి యాడువాండ్రు పరిభవంబు లేక బ్రతుక గలరు. అది యట్లుండె.

ఈనరపతి యాస్థానములో నున్నవారిలో నొక్కఁడేని తగవైన యెడపల్కునైనఁ బలుకఁజాలఁ డయ్యెఁ గదా! ఇందఱు చూచుచుండఁగా నీచుఁడగు కీచకుఁడు పతివ్రతనగు నన్ను నెందును నిట్టిస్త్రీలను నెవ్వరుఁ జేయని విధమునఁ జేయఁ గొందలకేని దయపుట్టదు గదా! ఇంకఁ జెప్పనదేమి?

అది యెల్ల నాకేల? ఇతండు మత్స్యదేశమున కొడయఁడు. వాకీ నరనాథు డూఱకగును. ఎవ్వరైన నధర్మ మొనర్చిన రాజు లారసి దండన మాచరింపవలయు. అట్టిచో నిచ్చో నన్నుఁ దన్నిన కీచకుని జూచి యూరకుంట భావ్యమా!”

నావుడువిరాటుఁడు చిత్తము కరుణాయత్తము కాఁగా ద్రౌపదినిగనుంగొనిఁ కీచకుని దండితునిఁజేయఁగాఁ దగుసత్త్వము లేమిఁజేసి. సాంత్వనవచనంబులతో నాతని రోషముమాన్పి కీచకుని బంపివేసెను.

సభవారందఱు "ఈ శుభలక్షణాంగియగు సుందరి సైరంధ్రికావుటయెట్లు? రాజు చూచుచుండఁగా నిద్దురాత్ముం డింతచేయునే! అనుచు గుసగుసలాడుచు మోములవిన్నఁదనం బుగదురగా ఖిన్నులై యుండిరి.

అపుడు ధర్మతనయుండు ఘర్మవారి లలాట భాగమును గప్పఁగా, విజృంభించు నధికరోషంబును ద్రోచికొనుచు, ధైర్య ము పెంపున నిర్వికారుఁడై ద్రౌపదితో నిట్లనియె.

"నీ తెఱఁగంతయు జననాయకుండు సభవారు నెఱింగిరి. ఇఁకఁబలుమాటలాడనేల! నీవును ధేనుపాలికి జనుము. గంధర్వు లకుఁదలఁగాదుగాన నూరకుండిరిగాని లేనిచో నీపరాభవంబునకుఁ గోపింపనేరరా! నాథులదూఱంగఁగాదు. సతికిసభలలోఁ దడవుగా నిల్చి, కంకచెడి, యిట్టు ధిక్కరింపఁబడుదు."

ధర్మనందనుని పలుకులువినియు సైరంధ్రియచ్చోటుఁ గదలకనిల్చి యెద్దియేనియుఁ బల్కఁదలంచి నట్లుండె. అదిచూచి ధర్మతనయుండు వెండియునిట్లనియె.

"పలుపోకలుపోవుచు విచ్చలవిడిగా నాట్యముచూపు విధమునఁ, గులసతులగరువంపు చందము వీడియిట్లుంటకగునా! లోడ్డోవదలిపోవుట మంచిది."

ములు చెప్పినను దేలక, మజ్జన భోజనాదులకుఁ జేరక ద్రౌపది కోపశోక విహ్వలయై యుండె. అట్టియెడను ధేష్ణచేయునది లేక నివ్వెరగంది యుండె. తక్కినయంగనలును కీచకుని నీచత్వంబు తలంచి వానిచేతను కొడంబడిరి.

# పండ్రెండవ ప్రకరణము

ఇట్లు పరిభవానల సంతప్తయైన పాంచాలి నిజశయన స్థానంబునకుం జనియె. తల్పంబుపై మేనువైచి యపాంగంబులం దొరఁగు కన్నీరు చెక్కుల క్రొలంకులు నిండ, నెవ్వాగలు నివ్వటిల్ల నాయమ యిట్లు తలపోయఁ జొచ్చె

"సింహబలుండు ప్రబలుండు. అతని జయింప భీముని బాహుబలంబు చూడఁదగు. ఇప్పట్ల నతనికి దైవబలంబును నవశ్యము గలుగును.' ఇట్లూహించుచుండ రాత్రిసమయంబయ్యె సమస్తజనంబులు క్రమంబున నిద్రింపఁ దొడంగిరి. ఆమెయు శయ్యాతలంబు విడచి మేనిధూళి కడిగికొని ధౌతపరిధానపరీతయై వృకోదరు కడకుం జని,

"కీచకుండు నన్ను బరాభవించి యున్నను దెలియంగున సదనంబున సుఖోచితశయ్య నిద్రించుచుండె. అప్పుడు నీకన్ను మొగడ్చి యూఱకుంటకు హేతువేమి! మీయన్న పరాక్రమంబు వలదనినఁ గాఁబోలు నాపై దయ మాలితివి.'

అనుచు మందస భాషణంబుల సంబోధించు పాంచాలి పాణిస్పర్శంబున మేలుకని, "ఇది యెవ్వర" నవుడు, "నేన"ను నమ్మానిని మెలుంగెఱింగి, భీముఁడు "యాజ్ఞసేని కీచకుని దురాగతంబు నాకుఁ బ్రకటించి, వాని నిర్జింప నియోగించునదై యరుగుదెంచెఁ గావలయు" నని తలంచుచుండ.

ద్రౌపదియు "భీమసేనా! యక్కులపాంసనుండు రౌద్రబున వెంబడించి తలపట్టి తిగిచుట నీవును జూచితివి. అప్పటి

పాత్ర యగు సుధేష్ణకుఁ బనులు గావించునెడ వెఱతు. కోపమునఁ బట్టఁజాలక, యొక నీచునిచేఁ దాఁడిపోయి కోలుపోయిన యభిమానమునఁ బెండముఁ గొందలపెట్టఁగా నేవో కొన్ని పలుకులు పలికితి. ఇంతియగాని సమస్తజనసంజనీయుఁడగు ధర్మతనయు నిట్టులు నిందించినదానఁ గాను. అతని నిర్మల సద్ధర్మమున ధాత్రికి నెల్ల బ్రదుకగుచుండ మనకును బ్రదుకుట యరుదా! వేగెద! అట్టి రాజసూయ మహాధ్వర కర్త నేఁడొకనికి పాత్రికుఁడై కూడు గుడ్డలు పెట్టు వాని సంది ప్రీతికి నీడగునట్లు సేవించుచున్నాఁడన నాకు ధృతి దూలక యెట్లు నిల్చును?

ఇంక బక హిడింబ జరాసంధుల బాహుబలగర్వాదుల నణఁచిన విజయాకరములగు నీకరములు వంటకట్టియలకు లావు చూపుచుండఁ జూచి చూచి వగచుచుండెద. మఱియు నిన్న మహిష వ్యాఘ్ర గజాదులతోఁ బోరించునపుడు నీమూర్తిపై గన్ను మనసు దగిలి యేమఱియుండు నన్నుఁ జూచి సుధేష్ణయు దక్కు జనంబులును బెక్కువిధంబులఁ దలపోసి గుజగుజలు వోవుచుండురు.

మగలకు మేటియగు నర్జునుండు రంగమునందు నిల్చి వికృతవేషముతో సుందరులకు నాటనేర్పువిధం బతిదీనము. దానిఁ జూచి దేవపతిసూనుఁడు కడుపుఁ బ్రోచికొన నింతటిలఘు వృత్తికి జొచ్చెనేయని పురపురఁ బొక్కుచుందును.

అత్యంత రమణీయదేహుండగు నకులుం డశ్వశిక్షకుఁ డట. అతని దుస్థితి యను దినంబుగాంచుచుఁ గన్నీరు నించుచుండెద. అట్టి జ్ఞానవంతుఁడు. సహదేవుఁడు గోపాలకవృత్తి

వహించి యడవులఁ దిరుగుచుండఁగా నాకు కాదు. విరోధులకేని మన మెఱియదా? మనము కాపలకు వచ్చునప్పుడు కుంతీమహాదేవి సహదేవుని నాకు నిల్లడంబెట్టి కోరిన పుత్రులు గ్రమ్మ చుండఁగా

చ॥ "కడుపునఁబిడ్డ వీఁడొకఁడు గాదవునా తెలుఁగండు సుందరుం
డ్యెడనొకపాటె తెలుఁగఁ డెదియెంతయుఁగోమల మెన్నఁడైన లేఁ
గుడువఁగఁబిల్తుఁగాని తనకుంగలయా, కటిప్రాద్దఱుంగఁ డీ
కొడుకిటుపోకకున్ మానముగుండెడు నిన్ననియంగారడి లేదున్"

అని యప్పగించె. నేనును వనవాసకాలంబున నానేర్చు విధమ్మున మీకెల్ల గారామైన తమ్ముని నెమ్మయింబెంచుకొని వచ్చితి. ఇపుడేమి చేయఁగాక చింతిల్లుచున్నదాన.

ద్రుపదుఁడు పుత్రులకంటె నెంతయుఁ బెంపునేయ పెరిగి కుంతీమహాదేవి కోడండ్రలో గారాయాడఁబరిగి, ప్రాణంబులకుఁ బ్రాణంబుగా మీపాపనెయ్యంబు తియ్యంబు దెలుపనడచి తల్లికి మాఱుగా జనులెల్ల భక్తిసేయ నెగడి, సుపుత్రులఁగాంచి భరతాన్వయంబు నందు నాయిల్లె యిల్లుగా నతిశయిల్లితి రాజసూయయాగమునఁ బృథ్వీదేవతాకోటికిఁ దృప్తియొసగితి.

అట్టి నేనిపుడు మనంబు పెంపుసెడి, యుదరపోషణకై దీనతతో సుధేష్ణ కనుసన్నఁబనులు చేయుచుండ మీకు వగపేమియుం జేయకుండె. ఏమిచెప్పుదు? నన్నుఁ బనిగొనునెడఁ బాండవాగ్రమహిషియుఁ గొంకుచుండెడిది. రాజదేవులు పెరవారు రాచిన చందనం బొల్లరు. మేనెల్ల జెమర్ప నేన పూయుదును. వారికి నున్నఁదనముగా నలుగు నూరి నూఁ నాపాణి

తలంబు చూడుమెటు కాయలు కాఁచెనో" అనుచు నశ్రుల మునిఁగిన మోము వానివక్షమ్మునఁ జేర్చె. భీముండును దేహ మలమటఁబొందఁ దత్కరములు తన మొగంబు కదియఁజేర్చి నిట్టూర్పు గాడ్పునిగుడఁ జింతాక్రాంతుండై యుండె. అంత నతనిఁజూచి ద్రౌపది యిట్లనియె.

"కావున నీయభ్యుదయాభివృద్ధి నాకమ్మఁగోరి నేనిట్టి యాపదల కోర్చితి. దాసికేమి? నేఁడీ కావలుఁడగు కీచకుఁడు తలపట్టి తిగిచిరన్నిన యిమ్మెయి దూఱుచుంటి భీమసేన! వాని జెగటార్చవేసి నీవు కనుంగొనుచుండ నురినైన, నగ్నినైన విషంబునైన మేను దొఱఁగెద."

వృకోదరుఁడు చిఱునవ్వునవ్వి యిట్లనియె. "జలజాక్షీ! కీచకాధముని జంపుటకై యిమ్మెయి మట్టఁ బల్కవలయునా? ఎందుఁ జొచ్చెనేని, ధర్మతనయుండు తానవచ్చి యడ్డపడెనేని, నీవ పెంపారు కరుణగాచితేని నల్లి కీచకుఁడు నాచేఁబడుట నిక్కువము. ఇఁక వానిదెసఁ జింతిలవలదు. మనమున నూరడిల్లి యుండుము.

సింహబలుండు నిన్నుఁ బరిభవించి, మైమైతోన యునికిఁ జేసి, యుల్లియుం జెనకవచ్చు. నీవుం గ్రమంబున నొడంబడుట భావించికొని వానికి నర్తనశాల సంకేతంబుగాఁ జెప్పి రేయింటి మెయింజను దేర నియమింపుము. అచట వానిం దెగఁజూచి, నీకుం జూపి, నీ చిత్తంబు వడసెద. ఇత్తెఱంగు దప్ప నొండొక విధంబు కర్జంబుగాదు. ఇదియ నిశ్చయంబు. ఇట్లు సేయు వారము. చూడుము. వేగుచున్నయది, మేలుకాంచి జనంబులు మనల

గాంచి రేని వంచన బయలుపడిన గార్యంబు తప్పు. నీవు శయన స్థలంబులకుఁ బొమ్ము."

అని శయ్యాతలంబు విడిచి, యత్న్యిందటిమి కొన్ని యడుగులనిపి మరలి భీముండు కలుషితాత్ముఁడగుచు నెజ్జకు వచ్చె. అచ్చెలువయుఁ దన సద్రుంచు నెడకుఁ బోయి, పర్యంకంబున దనువు వైచి, యంకిలిదేతిసం దండంబు గొండలంబుతోడి సద్రం బారయని కనుదోయి మోడ్చియుండె.

అంతసూర్యోదయంబయ్యె. కీచకుండు చిడిముడిపాటుతోడ సింగారంబు చేసికొని యతిత్వరితగతి సుదేష్ణమందిరంబున కరిగె. ఎల్లుబ సయ్యెవిద నీ వచ్చున నియ్యకొనఁ జేసెద నని యువ్విళ్లూరుచు నందొకచో ద్రౌపదిం గనెను. కనియామెఁ జేరఁగాఁజని బహుప్రకారంబులగు దుర్వ్యాకారంబులు సేయుచుండె. ద్రౌపదియాతని గనియుంగానని విధంబుగ కొంత తనముందటి పనివెరవుననుండె. అంతనద్దురాత్ముఁడు ద్రుపద నందన జాయంబోయి "పద్మనేత్రా! నీచరణపద్మములు లెప్పుడుఁ గొల్వభోగ్యత గల్గెనేని నదినుమహాభాగ్యముకదా! నీవునన్నొక్కని నొల్లవా లేక కామసౌఖ్య వైరాగ్యమే నీమనస్సున స్థిరముచేసికొంటివా? నాకుయదార్థము వచింపుము. నాపైనొక యింత చూడ్కినిల్పిన మాత్రన మంగళసౌభాగ్యము కుందునా? యేమి చేలా! నాతగులమాఁటి పుచ్చుకము నన్నేలుకొనుము నిక్కముగవచింప నేన యీరాజ్యమును పాలన సేయుచుంటి. రాజును నెపంబిడి విరాటునకుఁ గూడుపెట్టుచుంటిని ఇంత యేల?

నిన్న నిమ్మ వేవురు చూచుచుండనట్లు స్త్రీగానొక్క పురుషుడుగాని కాదు కూడదనఁ గల్గెనే! పోటరులైన భర్తలు గల రంటివి. వాయులన్నను జలమును జూచితిగదా! ఇంకెవ్వరు గలరు?

అనిన సవ్యోలంది "వీఁడు దమకించి యున్నవాఁడు. నా యంత్రించుమాటలకు మున్న నడియబడెనేని కష్టంబు దప్పు" అని విచారించి, మొగ్గపడినయట్లు చూచి; తన హృదయ మెఱింగించుకీతి నిట్లనె "నాయందని యోగా సెప్పినఁ వినవుగదా! వేగపాటున నెలడలఁ దొడరఁ బాలదవు. విచ్చలవిడిసేసిన కర్జ మగునా! విచారమున వాంఛకుఁగాని వావియా! నామగలడఁకువ నుండరు ఇట్టులగుటంజేసి, యెల్లభంగుల రహస్యంబు గోలు పోనిరీతి, భగవదీయ వాంఛకనురూపం బెట్లలో యట్టుల చేయుము."

నావ్రుడుఁ గీచకుఁడును బొంగి "ఈ విచారణలతో నన్నిట్టు లేఁపనగునా! అయినను నీవు నేయువాఁడ. ఎయ్యెడ నెప్పుడెటుల నభిమతసిద్ధి యగు. తెలుపుము." అనఁ బాంచాలి తన యురుల వానకు తగులుట నిశ్చయించి, యనుగాగాయత్త చిత్తవోలె నిట్లనె. "పగలెల్ల నృత్యముచేసి యుత్తరలోనగు వారు పోవఁగా, నర్తనశాల యొంటయు వేశ్మకుఁ బట్టగుచుం డును. అచ్చటికి నీవొంటిమెయి నేఁటి రేయి వచ్చునది." నీ వొక్కడవ యరుగుదేరవలయును. లేదు న నయ్యెడ నిలుచు దానగాను. ఇంక మనమిచటఁ బెద్దయుఁ బ్రొద్దు మసలుటతగదు. పొమ్ము. నేను నాపని చేసికొనుచుందు."

కీచకుండు వికసిల్లుచు, సమయనిర్ణయము నిజచిత్తము నకు నింపుపెంప స్వగృహమునకుఁ బోయె. ద్రౌపది సముచిత రీతి మహానసశాలలోనికిఁ బోయి, భీమునితో నతిగూఢక్రోధ వహ్ని రగుల్కొల్పుచు "నా కొంతఁ దీర్చివచ్చితి. ఇఁక నీ కొంతయ గలదు." అని సమస్తకథయు నివేదించె. భీముం డును బరమాహ్లాదంబున బొంది, "వాఁడొక్కఁడే మదాంధ వృత్తి నాట్యశాలకు వచ్చును. వెదకిచూచి నన్నుఁ గని సంగ రం బిచ్చు. అస్మద్బాహుబలహీనబలుఁడై చచ్చు. ఇఁక విచార మేల? నా బాహుబలమునకు మాఱుకొనఁజాలు భుజబలంబు గలిగి చిక్కి, పెనఁగి నన్నొకయింత కినియించెనేని, భూచక్రము సంచలింప, దిశమల్లల్లాడఁ, కులపర్వతంబులు కంపింప, సముద్రములు ఘూర్ణనమొందఁ క్రోధముఁ గృతార్థత్వంబు నొందించెద." అని పలుక ద్రౌపది సంచలితస్వాంతయై యాతని తీవ్ర క్రోధంబు గుప్తసాధనంబునకు బాధకంబు కాఁగలదని వగచి, "పరులు నవ్వఁగా ధర్మజుండు నెవ్వగఁ బొందఁగా నీవు చేయ నెంచిన పని గూఢవృత్తికి దవ్వగును. అట్లైనాఁడు నా యభిమ తం బొడఁగూడియుఁ దుదినిష్ఫలమై పోవును. కావున వంచన బాహిరపోవక యుండునట్లు నీవుఁ బరిమార్పవచ్చునేని ప్రయ త్నముచేయుము. లేనిచో వలదు." అన భీముం డిట్లనియె,

"సంకులయుద్ధసమయమున రహస్య విభేదభయము నా కొదవునా? ఓపినంతవరకు నిగూఢవృత్తితో నాతని బరి మార్పఁజాలుదు." పాంచాలియు 'జయలక్ష్మిఁ గొనుమ'ని దీవిం చుచు వెడలిపోయె.

అటఁ గీచకుఁడును ఎట్టకేనియుఁ బ్రొద్దుగ్రుంకఁ జంద్రాస్తమయసమయము దాఁక వేచికొంత లేక మండపాభ్యంతరభూమిఁ జొచ్చె. అంతకుమున్న ద్రౌపదీభీములచటికి వచ్చియుండిరి. భీముండు సెజ్జపైఁ బరుండియుండె. పాంచాలి గొంచె మావలి నిలిచియుండె. అందు సమస్త మంధకారావృతమై యుండె.

అట్టియెడఁ గీచకుండు సెజ్జఁజేరి కేలుసాచి తోడ్తో మేను గలుపఁగా "మంచి మంచివస్తువు లేరి తెచ్చితి. ప్రియంబునఁ గైకొనుము." అన రోమశకఠినంబైన హస్తముతో భీముండు వానిఁ దలపట్టి వంచె. వాఁడు గర్వంబున గంధర్వుఁడను తలపుతో భీమునిఁబట్టి త్రోచె. ఇరువురును పెద్దకాలము సంకులముగ భయంకరముగఁ బోరిరి. పోరినకొలఁది భీముని బలము పెరుగఁదొడంగె. కీచకుని లావు తరుగఁజొచ్చె. దానినెఱింగి భీముఁడు పల్లవఫలభరితంబగు మ్రాను గాలిఁ ద్రోచుభంగి నాతనిఁ గూల్చి విశ్రుతవు జాను చాపఁ దలఁచి యవయవము లన్నియు మేనిలోనికి నుగ్గుగాఁ దఁటిమి రొకముద్దగఁ జేసెను.

ద్రౌపది గూఢముగా వనలముగొని వచ్చి యక్కజముగ నున్న యాపీనుఁగుఁ జూచి విషాదముతో వెఱఁగందె. పిదప భీముని స్తుతించె. అతఁడును దోడ్తోఁ జని మహానస పరిసరంబున శరీరప్రక్షాళనంబు చేసికొని కృతకృత్యుండై నిజశయ్యాతలంబునఁ గూర్చుండె.

ఇట ద్రౌపది "భీమసేనుఁ డింతకు వంటయింటికిఁ బోయి నిశ్చింతంబుగ నుండునని నిశ్చయించి నర్తనశాల వెలువడి

కావలివారం బిలిచి నా గంధర్వపతులు కీచకుం జంపిరని" పలుకగాఁ బెద్దయుం బ్రొద్దు పెద్ద గందరగోళమయ్యె.

ఆకలకలమెఱింగి యుపకీచకులు నృత్యశాలఁ జొచ్చి, సోదరుని రూపఱిన కాయముఁ జూచి పలువిధములఁ బలవించుచుండిరి. "వీరి చందములు చూతముగాక" యంచు నచటికి వచ్చిన ద్రౌపదిం జూచి యుపకీచకులు మహోగ్రకోపులై "ఇది గదా ఈతని పొడవడగించినది. పెడకేలుగట్టి దీనినితని యొడలి పయిం బెట్టి కాల్చుట లెస్స" యని రాజాజ్ఞ బలవంతంబునఁ గైకొని సూతుని పీనుఁగుమీఁదఁ బాంచాలిఁ బెట్టికట్టి పితృవనము దెసకుఁ జనుచుండిరి.

పాంచాలిభయభ్రాంతయై "ఓజయ జయంత విజయ జయత్సేనజయద్బలులారా! అంధనైతి. నా కుయ్యాలించి వచ్చి రక్షింపవేగరావలయు." అని యతిరావముగా నాక్రందన మొనర్చె.

ఆయ్యెలుంగు భీముండేర్పడ విని వచ్చిచూచి "వీండ్రింత చేయుదురే" యని ప్రేతభూమికి లంఘించిపోయి, యొక్క మహావృక్షంబు పెఱికినిలిచియుండె.

వచ్చు నుపకీచకులు ఆ మహాభయంకరమూర్తింగని, శవమటఁ బారవైచి కలఁగఁబాఱిరి. భీముఁడు వారివెంటఁబాఱి నూట యేవు రుపకీచకులను జేతులఁ దీఁటపోవ నఱుముచేసె, పిదప శమితక్రోధుండై వచ్చి, పాంచాలీబంధ మోక్షంబు గావించి "ఇంక నిశ్చింతంబున సుదేష్ణనివాసంబునకుం జనుమని, తానును. వేఱొక్కమార్గంబున మహానసగృహంబున కరుగుదెంచె.

విరాటుండు కీచకానుజులును గంధర్వులచేత నిరవశేషంబుగా మృతిపొందిరనివిని సహోదరమరణ శోకాయత్తచిత్తయైన జీవితేశ్వరినోదార్చి "అమ్మా! సైరంధ్రిని పురివెడలి పొమ్మని నీవిప్పుడే చెప్పుము, లేనిచో నాకును దానికతన నందఱకును చావు మూడును" అనియామె నొప్పించెను.

అంతఁ బ్రభాతంబయ్యె. అటనున్న పాంచాలి సచేలస్నానంబు గావించి, మందమందయానంబులఁ బురంబు చొచ్చి రాజవీధిం దిరుగుచుండె. ఆమెఁ జూచి ప్రజలందఱు భయపడి పాఱిపోవుచుండిరి. వారిం జూచి నవ్వుచు ద్రౌపది మహానసశాల వాకిట నిలిచి భీమసేనుం గని, కీచకులం జంపి నన్ను రక్షించిన పరమ ధర్మమూర్తియగు గంధర్వపతికిఁ బ్రణామములు" అని కృతజ్ఞత తెలిపి నర్తనశాలకేగె. అట బృహన్నల సైరంధ్రి కిట్లనియె. "ఆ పాపాత్ముల నీచవ్యాపారమును వారు మృత్యుప్రాప్తులైన తెఱంగును నీపలుకుల నెఱుఁగలేకయున్నాను. చెప్పుము." సైరంధ్రి సాభిప్రాయంబుగా "కన్యల కాటగఱపుచు సుఖమున్న నీకు సైరంధ్రి యేమయ్యెనని ఖేదము లేమి గదా నన్నిట్లు స్మితాననంబుతోఁ బ్రశ్నించుటకు మనసొప్పె." అని కన్యకాజన పరివృతయై యంతఃపురంబు సొచ్చి, సుధేష్ణ కడకుం జనియె.

ఆమెయు భయశోకంబులతో సంభావన సేసి, తల్లీ! నీవు చక్కనిదానవు. మగవారు ధైర్యరహితచిత్తులు. దీనిం దలంచి భయమంది నీవలదు నెడకు నరుగవలయునని రాజుగారు చెప్పిరి." అని యనుజవియోగతాపం బుత్కటంబుగా వేఁడియు నిట్లనియె. "విరుదుగల మగలున్నారని ప్రతివారిం జంపింపఁ

జూతువు. జనములు నీపొరుగుఁ బోవవెఱచుచున్నారు. మాపురము రాష్ట్రమువీడి యొండైనఁ బోవును."

సైరంధ్రి యిట్లనియె. "ఇఁక మూఁడు దినంబులు మాత్రము నీగృహమందుండుదును. అంతవఱకు దయతో నియ్యకొనుము. మత్పతులు ఉపకారవ్రతులు. ఈనరపతికి శుభము లిత్తురు." సుధేష్ణయు అంతవఱకు సద్గృహంబున నుండ నంగీకరించితి" నని తెల్పె.

ఇది యిట్లుండఁ గౌరవులు కీచకు వధను విని, చంపినవాఁడు భీమసేనుఁడ గావలయు నని నిశ్చయించుకొని, తేల్చుకొనుటకై సుశర్మయను వానిం బంపిన నతఁడు స్వసైన్యంబుగా వచ్చి విరాటుని గోవులను ముట్టడింప విరాటుఁడు మొదలగు వారు వానితో యుద్ధంబుఁ జేయఁ జనిరి.

మఱునాఁడు సూర్యోదయానంతరమున దుర్యోధనుఁడు భీష్మ ద్రోణ కర్ణాదులతో వచ్చి విరాటుని గోవులను నుత్తర దిక్కున నున్నవానిం బట్టుకొనె. పురమునందలి వీరులందఱు సుశర్మతో యుద్ధము చేయుచుండుటం జేసి విరాటుని పుత్రుఁడగు నుత్తరుఁడు కౌరసేన మార్కొన నెంచి, సారథి లేమికి విచారించుచుండె. ద్రౌపదియు నత్తెఱంగంతయు నింద్రతనయునితోఁ జెప్పె. అర్జునుం డజ్ఞాతవాస వత్సరం బతీతంబగుట నిరూపించి, పాంచాలి కిట్లనియె. "నీవు పోయి వారలతో మన బృహన్నలకు సారథ్యంబుసేయు సామర్థ్యంబు గలదు. తొల్లి ఖాండవ దహనసమయమున నర్జునునకు సారథ్యంబుసేసి యతని చిత్తంబు వడసె. తత్సాహాయ్యంబునఁ గురుసైన్యంబు జయించుటకు

సంశయంబు వలదనెనది." "అట్లు సేయుదు" నని సైరంధ్రి యత్తెఱం గంతయు నుత్తరకుఁ జెప్పె. ఉత్తరయుఁ దన యన్నకు దాని నెఱింగించె. ఎట్టకేలకు నుత్తరుఁడు బృహన్నలను సారథిగాఁ జేసికొని, తత్సాహాయ్యంబున సర్వకురు సైన్యంబును నోడించి గోవులఁ గ్రమ్మరఁ గైకొనివచ్చె.

అంతకు మున్న భీముని సాహాయ్యముతో సుశర్మాదుల జయించి, కుమారుని శౌర్యము విని సంతోషించుచున్న విరాటునకు ధర్మరాజది యంతయు బృహన్నల ప్రభావమని చెప్ప విరాటుఁడు కోపించి యజాతశత్రుని సారెఁగొని వ్రేసె. వ్రేటువడి ధర్మజుఁడు అటనున్న పాంచాలిదెసఁజూచె. అయ్యంతియు వ్రేటు గంటిందొరగు రుధిరంబు తన యుత్తరీయంబున మెత్తన యొత్తుచుండె. "అదియేల" యని విరాటుం డడుగ సైరంధ్రి యిట్లనియె. "పుణ్యాత్ముఁడగు నీతని రక్తంబు ధరణి పై నెన్నిబిందువులు దొరగునో యన్ని వర్షములు వాన పుట్టుటకుఁ జాలక యుబ్బంగిఁ జేయుచుంటిని."

ఇంతలో నుత్తరుఁడు లోనగు వారందఱు వచ్చిరి. విరాటుఁ డుత్తరుని కౌఁగిలించుకొని "యట్టి కురుసైన్యము నెట్లు లోర్చితివి" అని యడుగ నాతండు తనదేమియు లేదనియు, నంతయుని బృహన్నల నెఱవేర్చెనని చెప్పె. మఱియు నందఱకు సమ్మోదముగా నా బృహన్నలే యర్జునుఁ డని యెఱింగించె. అంత నర్జునుఁడు తమవారినందఱ నెఱింగించె. అందఱు పరమానంద కందళిత హృదయారవిందులై యుండిరి. విరాటుఁడు పాండవుల నుచితరీతి సత్కరించె.

# పదుమూడవ ప్రకరణము

అజ్ఞాతవాసంబు నిర్విఘ్నంబుగాఁ గడపిన మీఁదఁ బాండవులు కౌరవులు యుద్ధసన్నద్ధులగుచుండిరి. సంజయుని రాయబారము మొదలగునవి నిష్ఫలములై పోయె.

అట్టిసమయంబున ధర్మరాజు సమస్త పరిజనంబులు పరివేష్టింప, సుఖాసీనుండై యుండి శ్రీకృష్ణునితో నిట్లనియె." ఇది మిత్రకార్యంబు చక్కఁజేయుటకు సమయము. మాయావశమగు ధరిత్రి సుయోధనునితోఁ బోరాటదక్క యనుభవింపవలయునని యున్నది. కావుననీవు ధృతరాష్ట్రునొద్దకుఁజని తగినమాటలాడి తెలియఁగఁజేయవలయును. తుదకు మాయేవురకు నయిదూళ్ళిచ్చినఁజాలు నంటినని చెప్పుము."

కృష్ణుఁడును దానికొడంబడియె. భీమార్జున నకులులును సమ్మతించి, తదనుకూలముగా తమతమ సందేశంబులు తెలిపిరి ఒక్క సహదేవుండుమాత్రము దానికొడఁబడకయుండె.

అయ్యవసరంబున ధర్మనందనుని పలుకులు హృదయతాప మొసరింపఁగా మోమున దైన్యముదోఁప, పాంచాలి శ్రీకృష్ణునితో గద్గదకంఠియగుచు నిట్లనియె.

"ఇంతలంతలు నేసి సంజయుని చేతరాయబారమంపిరి. దానికి యుధిష్ఠిరుఁడు ప్రియమంది, యయిదూళ్ళిచ్చినఁ జాలుననుచున్నాఁడు. ఈ యయిదూళ్లనేని సుయోధనుఁడిచ్చునా? ఈయకేమి? ఈయక యాతఁడంత నిర్దయుఁడై యన్నదమ్ములనేచునా! ఆతమ్మునిమీఁదఁగల కూర్మిపేర్మి చేతనీయన్న

ఉ॥ నీవుసుభద్రకంటెఁ గడునెయ్యము గారవముందలిర్ప సం
భావనసేయుచు బిట్టినసుఁ బంకజనాభ యొకందుపట్టి రాజసూ
యావభృథంబునందు శుచియై తెనుపొందినవేణిపట్టి యీ
యేవురుఁజూడఁగా సభకునీడ్చెఁ గులాంగన నిట్లొనర్తురే.

ఉ॥ ఆసభకేకవస్త్ర యగునట్టినన్నుం గొనవచ్చి నొంచు దు
శ్శాసనుఁజూచుచున్ బతులసంభ్రములై తెగుచేష్టలేక నా
యాసలుమాని చిత్రములయాకృతినున్నయెడన్ ముకుంద వి
శ్వాసముతోడ నిన్గొలువవచ్చె మనంబతియుం దలంచవే!

చ॥ అరయమిఁజేసి కోడలనకప్పుడు దానిగఁజెనె నమ్మహో
పురుషునిపాలికిం బతులువోవఁగ వీరలతోనయేను జె
చ్చెరఁజని కోటగింబు డిగఁజేయుదునో? యటుగాకపాడిమై
వరవుడ మోపిచేయుదునో వారికి మాధవ నిశ్చయింపుమా?

అని బంధురమైన క్రొమ్ముడినూడ్చి వెండ్రుకలువిడ్చి, వల చేతఁ బూని, మనంబున విషాదరోషములు పొంగఁగా దిగ్గనలేచి యార్త్రమూర్తియై బాష్పములు గ్రమ్ముకొనుచుండ, మహాభుజంగమో నావిలసిల్లు వెండ్రుకలు కృష్ణుని ముందుపెట్టి వెండియు నిట్లనియె.

కం॥ "ఇవిదుస్ససేను వ్రేళ్లం
దవిలి సగర్వద్విపోయెఁ దక్కినసమయమని కా
తర్పులకడఁ దీఱుమాటల
యవసరమునఁ దలఁపవలయు నచ్యుత వీనిన్

ఈ వెండ్రుకలు పట్టుకొని యీడ్చిన యా దుశ్శాసనుని తను వింతలింతలు తునియలై చెల్లాచెదరై రూపఱియున్నఁ జూచి యమగారుగాక! మఱియొకవిధమున నాయనదియా యీ

చిచ్చు! ఇన్ని బన్నములు పడిన ధర్మనందనుండును, నేనును, రాజరాజు పీనుఁగు గన్నారఁ గాంచమేని భీముని బాహుబలం బింకేల! కాల్పనా? గాండీవమను నోఁ విల్లెవుఁ బట్టుకొని యుండు నర్జునుని నిగ్రహముమేల! ఖండింపనా?

ఇంతకాలము నామదిలోఁ నీయల్కనాడిలోఁ పెద్దచిచ్చు గట్టుకొన్నట్లు నిల్పితి. దుష్టనిగ్రహబుద్ధితో జగంబులఁ గాంచు నట్టితోఁ బుట్టువపు నీవును, దేజమునఁబొల్చు భర్తలును గలుగగా నా యీ చిచ్చుపకు నాఱుటెన్నడును బుట్టదా.”

అనియెలుఁగు రాలుపడనేడ్చిన యాజ్ఞసేనింగని కృపాయత్తచిత్తుఁడై శ్రీకృష్ణుండూరార్చి, కూర్చుండఁ యమించి కన్నీరుదుడువను బెన్నిటి వేణిముడువను దగువారి నియోగించి యమ్మానినితో నిట్లనియె.

“సోదరీ! నేనుండగా గ్రముచ్చిరనేల! నాకు భీమార్జునులు తోడుగాఁగ ధర్మసుతుండు పంపఁగా నీకు మెచ్చుగా శత్రు సంతయముఁ జేయుగప. మఱియొక విధము లేదు. దురాత్ములగు కౌరవులింతకే యుర్వియిత్తురా? ఇప్పటి నీయేడ్పుల కొలఁదియె కురురాజపుత్ర కళత్రంబుల యేడ్పులు. వానిని గలకలవ్వుచు వినెడికాలము సమీపించినది. యముని మహిమము ఘంటికా నినాదములువిన గుతూహలముఁగల కౌరవులకు సంధికార్యములు శాంతవచనములు నిష్ఫలములగునా! ఇది విధినియతి. మేరువుతిరిగి నను దప్పదు. నాపల్కుపది వినుము. త్వరలోఁ వృషయంబు చేసి పాండుకుమారుల రాజ్యశ్రీ సమేతులగుదురు. నీవు జూతువు ఇందసత్యము లేదు.”



ద్రౌపదియుఁ దేఱుకొను చిత్తవృత్తితో నేడ్పుడిగి శాంతించెను.

లును దప్ప మిగిలిన వారందఱు హతులై"రని చెప్పి యశ్వ త్థామ కృప కృతవర్మలతో రయగతిం జనియె.

సూర్యోదయంబయ్యె. శిబిరంబున కనతి దూరంబున నున్న పాండవశౌరి సాత్యకుల కీవార్తఁ దెలిసె. పాండవులు బంధుమిత్రపుత్రాదుల దుర్మరణంబునకు వగలం బొగిలిరి. అంత ధర్మజుండు ద్రౌపదిని దీసికొని రా నకులుం బంచె. అతండు నుప ప్లావ్యంబునకు జని సుత సోదరమరణ ప్రకారం బాతన్వికి విని పించె.

ద్రౌపది నోరెండఁ బలవించుచు, నరుగుదెంచి, యధిక శోకాక్రాంతయై యా రాత్రిఁ గూరి యాక్రందనంబు సేయ నకులుం డొయ్యన యయ్యంగన నరదంబుడించె. తోడ నచ్చిన వనితా జనంబు లవతరణంబు సేసిరి. అంత ద్రౌపది పెనుమంచునం బె పఱిన వనజంబునుబోలె నశ్రుకణపరీతాననము చెలువెడలగాఁ బుత్రులఁబనువుచుఁ జరణములు తొట్రుపడుచుండఁ గొన్ని యడుగులువచ్చి, వసుధా తలంబున వ్రాలె. వాయునందనుం డా మగువం గ్రుచ్చియెత్తి ధర్మసూను సమీపంబునకుం దెచ్చె. అమ్మగువ మగుడ నిలంబడి యమ్మహీపతి యాననం బాలో కించి, మెలుంగురాలు పడఁగా "స పదకు నొప్పగునట్లు బలగం బయి నీయొద్ద నాపుత్రులు మెలంగఁ జూడఁ జాలనైతి. విక్ర మోజ్జ్వలుండగు సుభద్రాపుత్రుండును నమ్మయిపోయె. అనూన సంపతలు గలిగినను మనకా కుమారులమఱవఁగా వశమగునే" అని యశ్వత్థామోద్దామరణకరణ స్మరణంబు తన చిత్తం బుత్తలపెట్టఁ గోపంబు దీపింప నాసీనయై "భూపా! సుద్రా

సఖుల నానుతుల ముట్టికొని గురుతనూజుఁడు క్రూరతఁ దెగటార్చె. అది యారని చిచ్చై నామదిని గాల్పఁ దొడంగుచున్నయది. దీని మాన్ప నుపాయంబు మఱి యొండు లేదు. అయ్యుదయుని నామమడపవలయును. వేగంబ వాయుసుతుని బనిచి నేఁడటు సేయింపవేసి నేను ప్రాయోపవేశంబున నీకాయం బుపేక్షింతు." అనియె.

అమ్మనుజపతి యమ్మానినిని కిట్లనియె, "పోరమ్మృతిఁ జెందిన సుతసోదరులు పుణ్యపురుషోచిత సుగతులుగనిరి. వారికై వగలఁ జెద్పుడు చేల? నీకుపశమించుటకె కర్తవ్యంబు. అశ్వత్థామ యొనర్చిన పరాభవంబునఁ బుట్టిన కినుక వాని సమయింపక పోదు. వాఁడడవిం గలసిన వాఁడుగా నోవు. సమయించుట నీకెల్లయుంగనగు. చెప్పుము" అనిన నప్పొలఁతి "అప్పాపాత్మునకు సహజంబైన శిరోమణి కలదు. దానిని దెచ్చియిచ్చిన జూచి జీవంబుతో నుండెద" అనుచు, బవమానతనయుని దన పాణితలంబున సంస్పర్శించి క్షత్రధర్మము గైకొని, తయంబుమైనరిగి, గురుపుత్రుని ముట్టిచంపుము. నామది కనలుడిపి నన్ను రక్షింపుము. మఱియుఁ జతుగృహదాహ సమయమునఁ జూపిన పౌరుషంబుతో, హిడింబాసురుఁడు వచ్చినయపుడు గైకొన్న నిష్ఠురతతో, యక్షులు పోదవినపుడు వాటించిన దోర్బల వ్యాప్తితో గీచకుని జేచినయెడఁ జూపిన విక్రమస్ఫూర్తితో జని మనల గెలిచితినని గర్వించుచున్న యశ్వత్థామను గీటడంగింపుము."

అనినవిని యగ్గురుసుతుఁ డసంబాధమైన యమర్షంబున
మేనుఁ పొంగ శిబిరమునందు ద్రుపదనందనతో ధర్మనందనుండా
డినమాట లశ్వత్థామపైఁ బోవుట కనుమతిగా నంతరంగంబున
నంగీకరించి, కోదండశరగదాదండాది హేతిసంపన్నంబైన రథం
బెక్కె. గురుతనయాది యోధవరులయరదంబులచొప్పు పట్టి
కొని, త్వరితగతిం జనుచుండె.

అతని వెనువెంట శౌరిధనంజయ ధర్మరాజాదులు నరి
గిరి. కొండొకసేపునకు సమీరనందనస్యందనంబును గూడికొని,
వారందఱు భాగీరథీతీరంబున నొకచో గురుపుత్రుఁ గాంచిరి.
పాండవులను గృష్ణుఁ జూచుటతోడ్తో వారల దివ్యాస్త్రవేదిత్వం
బూహించి తలంకి యశ్వత్థామ బ్రహ్మశిరోనామకంబను దివ్యా
స్త్రంబుఁ దలంచి దాని పాండవులపైఁ బ్రయోగించె. కృష్ణుని
పనుపున నర్జునుండును దాని మఱలింప బ్రహ్మాస్త్రంబు ప్రయో
గించె. ఆ రెండు బ్రహ్మాస్త్రములు నవనీవ్యోమములందు నిండి రవి
వహ్నులవలెఁ బ్రోంచుచుఁ ద్రిలోకత్రాసంబు గావించుచుండె.
అప్పుడు మాధవునాజ్ఞచే నర్జునుఁడు బ్రహ్మాస్త్రద్వంద్వంబును
పసంహరించి, ద్రోణనందనుఁ బట్టుకొని, బంధించె, వారందఱు
శిబిరమునకు వచ్చి మహాపాశబద్ధుఁడగు గురునందనుని ద్రౌపదికిఁ
జూపిరి. అశ్వత్థామ లజ్జాపరాఙ్ముఖుండై యుండె. సుస్వభావ
యగు ద్రౌపది దయాంతఃకరణయై యాతనికి మ్రొక్కి యిట్లనియె.

మ॥ "పరగన్ మామగవార లందఱును మున్ బాణప్రయోగోప సం
హరణాద్యాయుధ విద్యలన్నియును ద్రోణాచార్యుచే నభ్యసిం
చిరి, పుత్రాకృతి నున్న ద్రోణుఁడవు, నీచిత్తంబులో లేశముం
గరుణాసంగము లేక శిష్యసుతులన్ ఖండింపఁగాఁ బాడియే!

క॥ భూసురుఁడవు బుద్ధిదయా
భాసురుఁడవు, శుద్ధవీరభట సందోహా
గ్రేసరుఁడవు శిశుమారణ
మాసురకృత్యంబు ధర్మమగునే తండ్రీ!

శా॥ ఉద్రేకంబునఁ గాదు, శస్త్రధరులై యుద్ధావనిన్ లేరు, కిం
చిద్ద్రోహంబును నీకుఁ జేయరు బలోత్సేకంబుతో; జీఁకటిన్
భద్రాకారులఁ జిన్నపాపల రణప్రౌఢక్రియాహీనులన్
నిద్రాసక్తుల సంహరింప నకటా నీచేతు లెట్లాడెనో!

ఉ॥ అక్కట పుత్రశోక జనితాకులభార విషణ్ణచిత్తనై
పొక్కుచునున్న భంగి నిను బోరఁ గిరీటి నిబద్ధుఁ జేసి నేఁ
డిక్కడి కీడ్చి తెచ్చుట సహింపనిదై భవదీయమాత నేఁ
డెక్కడ నిట్టిశోకమున నేక్రియ నేడ్చుచుఁ బొక్కుచున్నదో"

అని కృష్ణార్జునులఁ జూచి యిట్లనియె, "బ్రాహ్మణహింస పాపము. కాన విప్రవధ మానునది.

ధర్మ్యంబును సకరుణంబును నిర్వ్యలీకంబును, సమంబును శ్లాఘ్యంబును నగు నీ ద్రౌపదిపలుకునకు నందఱు సమ్మతించిరి. మొదట సమ్మతింపకయుఁ బిదప వాయుసుతుండొడఁబడియె.

అంత కృష్ణానుమతంబున నర్జునుఁ డశ్వత్థామ శిరోజములు దఱఁగి, మహారత్నమును బుచ్చుకొని, యాతని బంధవిముక్తునిఁ జేసె. అశ్వత్థామయు సిబ్బితితో నొడలి గబ్బుచెడి చనియె. ఆరత్నమును ద్రౌపది ధర్మరాజున కిచ్చె. ధర్మరాజును దానిఁదాల్చి యుదయరాగ సముజ్వల చంద్రబింబంబున బొల్చు పూర్వశైలంబువోలె నొప్పారె.

# పదునాల్గవ ప్రకరణము

పాండవులు యుద్ధనిహతులైన సకలబంధుమిత్ర జనంబులకు నుదకకర్మంబాచరించి గంగాతీరంబున నశుచిత్వంబపనయించుటకై యొక్క సమస్థలంబునఁ బటకుటీర సంవిధానంబు చేయించి నివసించుచుండిరి.

అందులకొకనాఁడు పారాశర్యుండేతెంచి ధర్మరాజుతో సకలజనప్రియహితంబగు పృథ్వీరక్షణంబు నీకుఁ గులధర్మంబై కర్తవ్యంబగుట యెఱుఁగవా" యనుడు నమ్మునీంద్రునకు నమ్మనుజేంద్రుం డిట్లనియె. "ప్రేమతోఁ దొడల పై నిడికొని బాల్యమునమమ్ముపలాలించు భీష్ముని జంపికొంటిమి. అత్యల్ప కాలభోగ్యమగు నీరాజ్యమునకాసించి యనల్పకీర్తిధనుఁడును, జరఠసింహకల్పుఁడునునగు మాపితామహుని ద్రుంచిన మా మనములింకను వగలఁ జివుకకున్నయవిగదా?

మఱియు రాజ్యలాభలోభరతుఁడనై యత్యంత పాపాస్పదానృత వాక్యంబులాడి గురునిగూల్పనేర్చిన క్రూరాత్ముఁడను నేనేగతికిఁబోవుదునో

మహావీరుండును దానవీరుండునునగు కర్ణుని మా భ్రాతను-జంపించి పాలించునవనీరాజ్యము మాకునాతంకత నేయుఁగాని సుఖమునొసంగునా?

మీఁదుమిక్కిలి సుభద్రాతనయుని ద్రౌపదీ తనయులను జంపికొంటి. ఇదిక్షంతవ్యముగాని దోషము. ఇఁకద్రౌపది గృహభారము నిర్వహింపనెట్లోపును?

ప్రాయోపవేశముచేసి యిత్తనువు దొఱఁగు తలంపు గదిరెడి. సంతాపాయత్తచిత్తుడను "పాపమకటకటా" యని పోనిడు. రాజ్యపరిగ్రహ పరత్వంబు మచ్చిత్తంబునం గలిమిం జేసి కిల్బిషంబత్యంతంబు నాచరింపవలసె. పరిగ్రహ దోషంబు పరిగ్రహత్యాగంబునంగానిపోదు. శక్తిగల సోదరులు రాజ్యం బేలుకొందురుగాక నేనుగాననంబునకుంజని మునిజన సంఘాతంబున సుఖినై యుండెద.

ధర్మజుని బుద్ధింద్రిప్ప సోదరులు నలువురు ప్రయత్నించిరి. పెక్కురు మునీశ్వరులు, దర్శనాగతులు ఉపదేశించిరి. కాని ధర్మజుఁ డప్పటి యట్ల చింతాక్రాంతుఁడై యుండెను.

తదనంతర మతనియెడ సవిశేషబహుమానయు, నతని చేత సంతోషపలాలితయు, ధర్మాధర్మనిదర్శనశీలయు నగు పాంచాలి యన్నరేంద్రు నల్లనచేరి, యాతని వదనంబున నిజ విశాలలోచనరోచులు పరఁగ, వినయం బాననంబున నతిశయిల్లఁగా నిట్లనియె. "మహాత్మా! శోకాగ్నిచే సొగియు నీ తమ్ములను వాక్యామృతమునఁ దేర్పుము. కాననయందుఁ ద్రిమ్మరునాఁడు వీరాయాసములు పడుటచూచి "సుయోధనుని జంపి భోగయాగత్యాగంబుల నలుపుదము"ని యూరడించుచుండువాఁడవు గదా! ఇవుడు వారల నుడికింపఁ దగునా? ధర్మసత్యములను నీకంటె నెఱిఁగెడువారు కలరా?

మఱియు నరేంద్రునకు మనస్సు పేదయగుట ధర్మవు గాదు. అతండు శిష్టుల రక్షింపను, దుష్టుల శిక్షింపను నర రూపమునఁ బరఁగెడి వరదేవత. అటుగావున రాజవగు నిన్నుఁ

పరాభవించిన యాదుష్టులు భవత్ప్రకోపశిఖిఁ గ్రాఁగిపోయిరి. దీనికై వగపేల!

అదియుంగాక నన్నుఁ దలపట్టి యీడ్చిన తప్పును దనదు తొడలు చూపిన తప్పును, నికృష్టవచనములఁ బలికిన తప్పును దుశ్శాసన దుర్యోధన కర్ణులయందుఁ గాంచి, వారి దండించితివి. ఇందుఁ గల్మషం బేమికలదు?

దండార్హులను దండింపని పక్షముననే సుమీ! భూవిభుఁడు గొప్ప కిల్బిషము పొందుట.”

అని యంతనిలువక చనువు మెఱసి మేలంపుఁజందంబున.

ఉ॥ వైదికధర్మచారి జనవత్సల నీమదిఁబట్టుకొన్నయ
న్మాదము హీనమానవు మనంబున బుట్టినవెఱ్ఱిపోకల న
ప్యాదులఁదీర్పఁటొప్పదు నిజానుజవర్గముమీఁదఁ గల్గు న
త్యాదర సాంద్రసారకరుణామృత మానఁగనిమ్ము సెమ్మదిన్

మఱియు నాయట్టిదుఃఖములఁ బడిన యంగన లెందైనఁ గలరా? అట్టి నేనును నీకు ధర్మాపాయము గలుగునని గృహ ధర్మప్రవృత్తిఁ బాయకుంటిని.

దీనికింత చింతయేల? తమ దురితమ్ములనఁ గౌరవులు తా రేఁసిరి. దానఁ గల్మష మేమి గలదు? భూభారము వహింప లెమ్ము. బహుయజ్ఞారంభణ మఖిలహితముగా నాచరింపుము. దేవపూర్వదేవగురులు పలికిన దండనీతి యందు నీవు పరిణతుఁడవు. నీకు జెప్పవలయున దేమి?” అని పలికె.

అంత నెట్టకేలకుఁ బలువురు బోధింపఁ జిత్తంబు కలంక దేఱి కౌంతేయాగ్రజుండు రాజ్యభారనిర్వహణోత్సాహం బంది

రింపఁగా శశిరాపగ సమయకమలంబు ననుకరించు నాననంబుతో నంథలి మునివర్యులకుఁ బ్రదక్షిణంబును బ్రణామంబును నాచరించి వారలవలన వివిధాశీర్వాదంబులుం బడసి వెలింగె. వారును నిజస్థానంబులకుఁ జనిరి.

మఱునాఁడు ధర్మరాజు కల్యంబునఁ గాలోచితకృత్యంబులాచరించి, ధవళానులేపనమాల్య వస్త్రాభరణంబుల నలంకృతుండై, షోడశధవళహరులఁ బూన్చిన రథంబెక్కి, ధృతరాష్ట్రుని నతని దేవిని బ్రభూతాందోళికారూఢులం జేసి పురస్కరించికొని, విదురుండు కుంతీ ద్రౌపదీ ప్రముఖ స్త్రీ జనంబుల నందలంబుల నిడికొని వెనుక నడువ, నరేంద్రులు నానా ముఖంబునఁ దమతమ సేనలతోడం గూడం గొలిచి చనుదెంచుచుండఁ, బ్రయాణించి కరినగరంబునం దై మహావైభవంబు మెఱయ నభిషిక్తుఁడై సుఖముండె.

# పదునేనవ ప్రకరణము

జయశ్రీ యుల్లసిల్ల ధర్మజుండు ముప్పదియైదు వత్సరంబులు ప్రజాను రంజకముగా రాజ్యపాలనంబొనర్చె. అనంతర సంవత్సరమున శ్రీకృష్ణుని పరమానందపద ప్రాప్తియు, బలభద్రుని యనంతత్వసిద్ధియు, సకలయాదవ మౌసలాహవ ప్రకారంబును నెఱింగి ధర్మజుండు మహాప్రస్థానంబునకు మనసొయిల యా దద్వృత్తాంతంబు ద్రౌపదికి సోదరులకు నెఱింగించి, వారికి నదియు, హితంబును నభిమతంబునని యెఱింగి, యభిమన్యుపుత్రునకుఁ బట్టముఁగట్టి, ధౌమ్యాది విప్రులకుఁ దృప్తిగా బహువస్తు కోటులనొసఁగి, బయలుదేరె. భీమార్జున నకుల సహదేవులను ద్రౌపదియుఁ గ్రమమున ధర్మజు ననుగమించి చనుచుండిరి.

అక్కురువంశ వరులను జూడఁ బౌరజనంబు లాబాల వృద్ధంబుగావచ్చిరి. తత్సమయంబు జూదపు నాఁడు వెడలి వారరిగెడు నవసరమును బోలియుండె. ప్రజలందఱు వారి వెంబడించి యఱుగుచు ధర్మరాజును "క్షమ"ని ప్రార్థించుచుండిరి. ధర్మజుఁడు తలవాంచి సోదర ద్రౌపదీ సహితుండై వెడలుచుండె. ఇట్లు ప్రజలందఱుఁ గడు దవ్వరిగి తనువులు దూలఁగా వారికిఁ బ్రదక్షిణ ప్రమాణంబు లాచరించి, వారి వీడ్కొని పట్టణంబు నేరంజనిరి. పాండవులును ద్రౌపదియు నుపవాసవ్రతముతో భాగీరథీప్రాంతమునకుఁ జని, యంత నుండియుఁ బ్రాఙ్ముఖవర్తనంబు గైకొని, యోగబలంబున నరిగి

గిరి సరి త్తరణ్యంబు లనేకంబులు గడచి పూర్వసముద్రతీరంబు చేరిరి. తదనంతరము దక్షిణాభిముఖతఁ దలకొని భూప్రదక్షిణంబుగాఁ బడమర మొగమై పశ్చిమ జలనిధితీరంబు చేరిరి. అటనుండి యుత్తరము నడచి హిమాచలము నతిక్రమించి యోగబలముచేత గతఖేదులై మేరుసమీప భూమికిం జనిరి.

అందు నతిసత్వరగతిఁ బ్రయాణించుచో నొకచోఁ బాంచాలరాజపుత్రి యోగమెడలి మేదినిం బడిపోయె. క్రమముగా సహదేవ నకులార్జున భీములును పడిపోయిరి. ధర్మరాజుడు ఇవి ఏమియు లెక్కచేయక స్వర్గమును చేరెను.

శ్రీ కృష్ణార్పణమస్తు.

Janakiram Press, Tenali. P. I. C. G. 38. C 200—II—45.

